అపకారికి కూడా
ఉపకారం చేయగలిగే
తేనెమనసులు ఆడవారివి
సీత పెళ్ళివల్ల తన పెళ్ళి
ఆగిపోయినా, చేదువైన భర్త
తిరిగి దూరమవుతున్నా
అవమానాలు అపనిందలూ
దిగమింగుతూ, ఓర్పుతో
నేర్పుతో తోటి ఆడపడుచు
కాపురం నిలబెట్టిన
తేనెమనసు
భానుమతి కథ

బాబూమూవీస్ వారి
అందాల
హరివిల్లు

# తేనెమనసులు

ఈస్ట్‌మన్ కలర్
దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు
నిర్మాత సి సుందరం
కోడైరెక్టర్ కె విశ్వనాథ్





(పాల్స్ & కో సమర్పణ)

త్రిఫిలింస్ విడుదల



హరిశ్చంద్రుడు భార్యనే సంహరించుకోవలని వచ్చిన దుర్ఘటన!

విజయావారి అద్వితీయ పౌరాణిక చిత్రం "సత్య హరిశ్చంద్ర"

నిర్మాత - దర్శకత్వం:
**K. V. రెడ్డి, B. Sc. Hon**

# మన లో మా ట

తమిళంలో శ్రీ జయకాంతన్ రచించిన కథ ఒకదానికి శ్రీమతి విశాఖగారి తెలుగు అనువాదం 38 వ పేజీలో చూడవచ్చును. జయకాంతన్ సుప్రసిద్ధుడయిన కథకులు మాత్రమే కాదు, దక్షిణ దేశంలో ఇంతకుపూర్వం ఎన్నడూ రానటువంటి తమిళ చిత్రాన్ని ఒకదానిని నిర్మించారు దానిపేరు "ఉన్నైప్పోల్ ఒరువన్". ఈ చిత్రం సత్యజిత్ రాయ్ చిత్రాలను పోలివున్నదని అప్పుడే కొందరు విమర్శకులు వ్యాఖ్యానించారు. శ్రీ జయకాంతన్ రచనలు కొన్ని లోగడ కూడా 'సచిత్రవారపత్రికలో వెలువడ్డాయి.

* * *

9 వ పేజీలో రష్యన్ వ్యోమగాములకు సంబంధించిన చిన్న వ్యాసం వేశాము. ఇదే అంశంపై అమెరికా కార్యకలాపాలను సమీక్షించే వ్యాసాన్నొకదానిని వచ్చేవారం వేయాలని అనుకుంటున్నాము.

* * *

బాలట్ ఫలితాలపై శ్రీ ఆదుర్తి సుబ్బారావు వ్రాసిన లేఖను 5 వ పేజీ మొదట్లో చూడవచ్చును మేము నిర్వహించిన సినిమా బాలట్ యొక్క ఫలితాలు చాలామందిని సంతృప్తి పర్చినట్లు మా కార్యాలయానికి వచ్చే ఉత్తరాలద్వారా తెలుస్తున్నది.

* * *

'పద్మశ్రీ' బిరుదుపొందిన శ్రీ నాగయ్యకు ఆంధ్రదేశంలోను, మద్రాసులోను ఘనంగా సన్మానాలు జరిగాయి. ఆ వార్తను 52 వ పేజీలో చూడవచ్చును. దక్షిణదేశంలో చలనచిత్రరంగంలో ఇంతటి గౌరవాన్నిపొందిన తొలి వ్యక్తి శ్రీ నాగయ్యగారే...

* * *

రచయితలు గమనించవలసిన ముఖ్యప్రకటన నొకదానిని 8 వ పేజీలో వేశాము. అందరూ ఆ నియమాన్ని పాటించటం ఎంతైనా అవసరమని తోస్తున్నది.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'తేనెమనసులు'లో సుకన్య.




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 16—4—'65

విశ్వావసునామ సం॥ చైత్ర బహుళ పాడ్యమి

సంపుటము : 57 సంచిక 33

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

## చందా వివరాలు

ఇండియా రూ 15 60 ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail ) రూ 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు: రూ 120 00. అమెరికా రూ. 176 80 ఆస్ట్రేలియా రూ 148.20

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15 60 పై.
6 మాసాల చందా 7.80 పై.





"మన నాటకం హాయిగా సాగించవచ్చు ఇంకా, మనకు తోడుగా విజయలక్ష్మి పండిట్ వున్నారుగా!"


ఇదీ కథ!
పాకిస్తాన్
అబ్దుల్లా
చైనా


కాలిలోని
ముల్లు
పార్టీ
విమర్శలు


పైకి పోవాలని
మానవ నే ఆరాటం
అల్జీరియా
ప్రయాణం


అమెరికా
పాకిస్తాన్-రష్యా
మైత్రి
చైనా

న్యూఢిల్లీ లేఖ :

# శ్రీ శాస్త్రి తమ నాయకత్వంమీద దాడిని ఎదుర్కోవాలి!

కృష్ణమాచారిగారు లోక్‌సభలో ప్రవేశపెట్టిన బడ్జెట్టుమీద తర్జనభర్జనలు జరుగుతున్నాయి. వాదోపవాదాలు తలెత్తాయి. 'సెభాష్' అన్నారు. కొందరు 'ఫరవాలేదులే' అన్నది ఒక వర్గం. మూడో వర్గం మూతి ముడుచుక కూర్చుంది!

వీళ్లల్లో కొందరికి సమాధానమూ, మరికొందరికి వంజాయిషీ చెప్పుకొనేందుకే అన్నట్లు ఆర్థిక మంత్రి శ్రీ కృష్ణమాచారి లోక్‌సభలో మళ్లీ ప్రసంగించారు. తన ప్రసంగాన్ని చాలావరకు ముక్కుసూటిగానే పోనిచ్చారు మధ్యలో, ఆయన విన్‌స్టన్ చర్చిల్ ఉదాహరణ నొకదానిని చెప్పారు. బ్రిటిష్ రాజ్యాన్ని గంగపాలు చేసేందుకు తాను రాలేదని ఒకప్పుడు చర్చిల్ అనేవారు అదే విధంగా, యూనాడు ఇండియా ప్రభుత్వాన్ని చిన్నాభిన్నం చేసేందుకు తాను నడుం కట్టలేదని శ్రీ టి టి కె పునరుద్ఘాటించారు కాని, బ్రిటిష్ సామ్రాజ్యం, చర్చిల్‌వల్ల కాకపోయినా, మరికొందరు ప్రబుద్ధుల మూలంగా కుంటువడ్డది! కృష్ణమాచారిగారన్నట్లు, ఇండియా స్వాతంత్ర్యానికి భావికాలంలో ఎలాంటి దశ ఎదురౌతుందో!

*

శాస్త్రిగారిని, ఆయన ప్రభుత్వాన్ని ఎతమతం చేస్తున్న సవాలక్ష సమస్యలకు తోడు, గత కొంది రోజులుగా శ్రీమతి విజయలక్ష్మి పండిట్ కూడా ధ్వజం ఎత్తింది భాషా సమస్య ఇంకా పరిష్కారం కాలేదు ఇతర సమస్యలు కూడా వికృతరూపాన్ని ధరించి శాస్త్రిగారిని చూచి పరిహసిస్తున్నాయి ఇలాంటి స్థితిలో విజయలక్ష్మి పండిట్ కూడా కదనరంగంలో దుముకటం కొత్త సమస్యలకు అవకాశాన్ని ఇస్తుంది శ్రీమతి పండిట్ ప్రసంగాలు శాస్త్రిగారి ప్రభుత్వంమీద తిరుగుబాటుగా స్ఫురిస్తాయి

ముఖ్యంగా శ్రీమతి పండిట్ లోక్‌సభలో ఇచ్చిన ఉపన్యాసం గమనార్హం వారి అంచనా ప్రకారం "ప్రభుత్వంలోని పెద్దలు అస్తవ్యస్తపు ధోరణులకు, అస్థిమితానికి బందీలు అయ్యారు కేరళ నుంచి కాశ్మీరు వరకు, అబ్దుల్లా మొదలు వియత్నాం వరకు సమస్యలు నానాటికీ అధికమవుతున్నాయి కృష్ణమాచార్లుగారు బడ్జెట్టు మీద బడ్జెట్టు వేసిన ధనం కొన్నిచోట్ల కొండల్లాగా పెరిగిపోతున్నది ప్రజలు పతనం చెందుతున్నారు సంఘం తిరోగమిస్తున్నది" అన్నారు శ్రీమతి పండిట్

## శ్రీమతి పండిట్ కర్చులు

ఇదంతా కేవలం విరోధాభాసంలాగా కనిపిస్తుంది స్వాతంత్ర్యం వచ్చిన తొలి క్షణం నుంచి విన్న మొన్నటి వరకూ ప్రభుత్వం ఖర్చుమీదనే స్వశక్తిని, సామర్థ్యన్ని పెంచుకొన్న విజయలక్ష్మి ఈనాడు ప్రభుత్వంమీద విసురులు విసరటం విడ్డూరంగా కనిపిస్తుంది.. ఆమాటకొస్తే, సామాన్యుడు ప్రభుత్వానికి పన్నుల రూపంలో చెల్లించిన ధనం ఎంత శ్రీమతి విజయలక్ష్మిపండిట్ కోసం ఖర్చయిందో లెక్కలు వేస్తే, వచ్చే ఫలితాలు ఆమె ప్రతిష్టకు భంగకరంగా ఉంటాయి

"అస్థవ్యస్థానికి బందీ" అయాడు ప్రధాని శ్రీ శాస్త్రి—అన్నారు శ్రీమతి పండిట్! శాస్త్రిగారు ఏపనీ త్వరగా చేయలేరట నిలకడ లేదట.... ఇంకా ఏవేవోట ...

అన్నీ నిజమే! విజయలక్ష్మి లాంటి వాళ్లకు ఇంతటి నోరు రావటానికి శాస్త్రిగారే కారణం ఆయన వహించిన మవునమే కారణం. పార్టీలో పెరిగిపోతున్న ఇలాంటి క్రమశిక్షణారాహిత్యాన్ని ఎప్పటికప్పుడు నిర్దాక్షిణ్యంగా అణచకపోవటం శాస్త్రిగారు చేసిన పెద్ద తప్పు అనిపిస్తుంది

ఇలాంటి సమయంలోనే ప్రధాని తన శాశక్యాన్ని ప్రదర్శించగలిగాలి ముందు తన పార్టీలో తనకు ఎంత బలం ఉన్నదో, ఎందరు తన నాయకత్వం కోరుతున్నారో తెలిసికోవాలి శ్రీమతి పండిట్‌కు 'సంజాయిషీ' చెప్పవలసిందని నోటీసు ఇవ్వాలి లేదా, ఏ చీకూ చింతా లేకుండా పదవి విరమణచేసి, పలుగురిచేత 'మంచి' అనిపించుకొనవచ్చును.

## శ్రీ అయ్యంగార్ మందలింపు

ఇండియన్ ఛేంబర్స్ ఆఫ్ కామర్స్ వార్షిక సమావేశం మొన్ననే జరిగింది ఈ సమావేశం సాధించిన లక్ష్యాల పట్ల ఇందుకు సంబంధించిన పలు చర్చలమీద చర్చలు జరిపారు. హెచ్ వి ఆర్ అయ్యంగార్ సైతం ఒక సమావేశంలో



ఢిల్లీవద్ద గోకుల్‌పూర్ గ్రామంలో విద్యుచ్ఛక్తి ప్రవేశపెట్టే మీటని శ్రీ శాస్త్రి నొక్కుతున్నారు

# న్యూఢిల్లీ లేఖ

ప్రసంగిస్తూ, ఛేంబర్స్ ఆఫ్ కామర్స్‌లో ఒక ప్రముఖుడు చదివిన ఉపన్యాసం కేవలం ప్రభుత్వాన్ని నిందించేందుకేనా అన్నట్లు ఉందన్నారు పైగా, ఆ ఉపన్యాసపు ధోరణి చూస్తే, శాంతస్వభావుడయిన శ్రీ శాస్త్రి కూడా ప్రతిఘటించకపోతారా అనే అనుమానం శ్రీ అయ్యంగార్‌కు కలిగింది

అంతర్జాతీయ అభివృద్ధికోసం ఏర్పడ్డ ఒకానొక అమెరికన్ శాఖ డైరెక్టరు ఒకరు మొన్ననే ఒక విందు—సమావేశంలో ప్రసంగిస్తూ, తమ దృక్పథం మార్చుకోవలసిందని, 'వ్యాపారవేత్త అన్న' పేరు సార్థకం చేసికోవలసిందని, ఆ పేరును దుర్వినియోగం చేసికోరాదని హెచ్చరించారు

విదేశాల నుంచి వచ్చే పెద్దలకు ఇండియాకు సంబంధించిన లేనిపోని అపోహలను యీ వ్యాపారవేత్తలే కలుగజేస్తున్నారన్న అభిప్రాయం నానాటికీ పెరిగిపోతున్నది ఈ విషయమై ప్రధాని శ్రీ శాస్త్రి, ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులు శ్రీ అశోక్ మెహతా కూడా చాలా నిరాశ చెందారు ఆమధ్య ఇండియా దర్శించి, ఇక్కడ నాలుగు వారాల పాటు పర్యటించ వచ్చిన ఒకానొక అమెరికన్ వాణిజ్య శాస్త్రవేత్త కూడా యీ విషయాన్ని ధృవపరచారు.

తాము ఈ దేశం వస్తుండగానే, కొందరు భారతీయ వ్యాపారవేత్తలే, ఇండియాగురించి దురభిప్రాయం వెలిబుచ్చారట

ఫెడరేషన్ గురించి మరో రెండు మాటలు: ప్రభుత్వపు పన్నుల విధానాన్ని, ఇలాగే ఆర్థిక మంత్రి బడ్జెట్‌ను సమర్థిస్తూ కొంగడ కొన్ని తీర్మానాలను ఆమోదించిన ఫెడరేషన్ ఇప్పుడు వాటిని ఉపసంహరించుకొన్నదట

ఫెడరేషన్ సభ్యులలో చాలామందికి అధికారాలే కాని, బాధ్యతలు లేవు బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తే, అధికారాలు సార్థకమవుతాయనే భావన ఎంతమందికి ఉన్నదో?

ఇండియా ఆర్థికరంగంలో ఎప్పటికప్పుడు వస్తున్న మార్పులకు, ఏర్పడే అవ్యవస్థ పరిస్థితికి వ్యాపారవేత్తలే బాధ్యులు కావటం దురదృష్టకరం.

—శ్రీకృష్ణ ★



## రచయితలకు మనవి

ఇకముందు మా కార్యాలయం చేరే ప్రతి రచనతోనూ దాని రచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంత రచనేననీ, దేనికి అనుకరణకాదనీ హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఆకాశంలో తేలాలంటే..

ఒక రష్యన్ అంతరిక్ష నౌక ఎక్కి కొన్ని వేల మైళ్ల వేగంతో భూమిని చుడుతున్నప్పుడు, ఒక స్పెషల్ సూట్ వేసుకుని నావ బయటికి అడుగు వెయ్యాలి ... .. ...

కొన్ని రోజుల క్రితం రష్యన్ 'అంతరిక్ష నావికుడు' అలెక్సెయ్ ఆర్కిపోవిచ్ లియొనావ్ అంత పనీ చేశాడు! లక్షలాది రష్యన్‌లు ఇతని అద్భుత, సాహసకృత్యాన్ని టెలివిషన్‌మీద తమ కళ్లతో చూశారు

ముప్ఫయి సంవత్సరాల క్రితం, సైబీరియా ప్రాంతంలో లిస్ట్‌వ్యాంకా అనే గ్రామంలో పుట్టి, పదమూడేళ్లప్పుడు తూర్పు ప్రష్యా దేశంలోని కాలినిన్‌గ్రాడ్‌కి తలిదండ్రులతో తరలి వెళ్లిపోయి, 1953 లో స్కూలు ముగించి, ఖార్కొవ్ వద్ద పైలట్ తర్ఫీదు పుచ్చుకొని అంతరిక్ష ప్రయాణ పరిశోధనలోకి దిగాడు చివరికి ఆకాశంలో తేల గలిగిన మొదటి మానవు డయాడు—లియొనావ్

## ఎలా తేలాడు?

తేలాడంటే మామూలుగా నీటిలో తేలినట్లు గాలిలో తేలలేదు బరువు లేకపోవటంవల్ల తేలా డన్నమాట! అంటే భూమ్యాకర్షణశక్తి తక్కువగా ఉన్నంత ఎత్తులో నావ వదిలి అంతరిక్షంలోకి అడుగు వెయ్యటంచేత తేలాడన్నమాట!! (నేలమీద కొన్ని అడుగుల ఎత్తులలోనూ భూమ్యాకర్షణశక్తి తగ్గిపోయి మనుష్యులు తేలేట్లు చెయ్యటానికి వీలుంది అటువంటి పరిశోధనలు జరిగాయి కూడా కాని, అంతరిక్ష నావ వదిలి ఆకాశంలో తేలటం ఇదే మొదటిసారి.)

వోస్కోడ్—2 18000 మైళ్ళ [గం]టకి వేగంతో—భూమిని 90 నిముషాలలో [illegible] గల దన్నమాట!—ఆకాశంలో ఎగిరి [illegible] లగా ఉండగా లియొనావ్ నావలోనుంచి బయటికి వచ్చాడు అతని సూటు తెల్లని రంగుది ఆకాశంలోని తీక్షణమయిన వేడిని, చలిని ఆపగలదు అంతేకాక, కొన్ని రకాల కాంతి కిరణాలకి కూడా తట్టుకోగలదు వీపుమీద ప్రాణవాయువు సిలిండర్లు ఉన్నాయి కాని అవి ప్రమాదం జరిగినప్పుడే వాడటానికని కొందరి అభిప్రాయం లియొనావ్‌ని వోస్కోడ్‌కి కట్టిన 'తాడు', నిజానికి గొట్టం అని, దాని ద్వారా ఎలెక్ట్రిక్ తీగలతోబాటు ప్రాణవాయువు గొట్టం కూడా ఉంటుందని వారంటున్నారు ఈ 'తాడు' ద్వారా లియొనావ్ వదిలే ఉచ్ఛ్వాసిరి, చెమటవల్ల తేమ మొదలయిన వాటిని పీల్చివేసే ఏర్పాట్లు చేసి ఉంటారని వారు వూహిస్తున్నారు బయటికి వచ్చేముందు కొంతసేపు లియొనావ్ గాలి బదులు ప్రాణవాయువు పీల్చాడు (గాలిలోని నత్రజని రక్తంలో కరిగి వాయుపీడనం తగ్గినప్పుడు విడుదల అయి విపరీతమయిన బాధతో కూడిన నొప్పికి కారణం కాగలదు) 'ఆకాశంలో 20 నిముషాలు గడిపి మళ్లీ నావలోకి వెళ్లిపోయాడు

## బెల్యయేవ్

వోస్కోడ్—2 లో లియొనావ్ సహచరుడు పావెల్ ఇవానోవిచ్ బెల్యయేవ్ ఇతని వయసు 39 లెనిన్‌గ్రాడ్ వద్ద పుట్టాడు 16 వ ఏట సైన్యంలో చేరపోయాడు కాని వయసు చాలలేదని అధికారులు అంగీకరించలేదు రెండేళ్ళు ఒక కర్మాగారంలో పనిచేసి విమానదళంలో చేరాడు చివరికి అంతరిక్ష పరిశోధనలలో పడ్డాడు—పైకి ఎగిరాడు! 'బయట' నడవకపోయినా సాహసంలో, నైపుణ్యంలో ఎవరికీ తీసిపోడు

ఇంతకీ లియొనావ్ సాహసకృత్యంలోని ప్రత్యేకత ఏమిటి? చాలా ఉంది అంతరిక్షయానం ఉపగ్రహాల దాకా, గ్రహాలదాకా సాగాలంటే గమ్యస్థానం చేరుకునే మార్గాలు రెండు రకాలు (అని నిపుణులు చెప్తారు) ఒకటి, భూమిమీద నుంచి నేరుగా గమ్యస్థానమయిన గోళం దగ్గరికి రాకెట్ లాగా వెళ్లిపోయి వేగం తగ్గించి దాని మీదకి దిగటం

## మరో పద్ధతి

ఈ పద్ధతి ప్రకారం భూమ్యాకర్షణ శక్తిని వదిలివెళ్ళే పెద్ద పెద్ద రాకెట్లు అవసరం అవుతాయి అందుకని, కొంతకాలంగా మరొక పద్ధతిని కొందరు సూచించారు భూమికి కొన్ని వందల మైళ్ళ ఎత్తులో ఒక స్టేషన్ నిర్మించి (అది భూమి చుట్టూ తిరుగుతూనే ఉంటుంది కాబట్టి), దాని మీద పెద్ద పరిశోధన కేంద్రం ఒకటి ఏర్పాటు చేసి అక్కడనుంచి రాకెట్లతో ఎక్కడికైనా వెళ్ళవచ్చు నంటారు స్టేషన్‌మీద భూమి ఆకర్షణ శక్తి తక్కువగా ఉంటుంది కనుక ఇది తేలిక పని కిందే వూహించవచ్చు ఈ పద్ధతినే 'వైజ్ఞానిక కథలు' రాసేవారు ఎందరో తమ తమ పుస్తకాలలో వర్ణించారు అమెరికాలో అంతరిక్షయాన పరిశోధనలు జరుపుతున్న మాజీ జర్మన్ శాస్త్రవేత్త డాక్టరు వెర్నర్ ఫాన్ బ్రవున్‌కి దీనిమీదనే ఎక్కువ నమ్మకం ఉందిట

లియొనావ్, బెల్యయేవ్‌లు సాధించిన ప్రక్రియ దీనికి దారితీస్తుంది ఇంకా పెద్ద నావలు కట్టి పనివారు ఆకాశంలోకి 'దిగి' పెద్ద నిర్మాణాలు చేసే అవకాశం కలిగింది కదా! (స్పుట్నిక్—2 ప్రయోగం చేసేముందు కూడా రాకెట్‌ని కక్ష్యలోకి పంపటం విషయమయి వాద వివాదాలుండేవి!)

ఏవిధంగా చూసినా లియొనావ్, బెల్యయేవ్‌లు మార్గదర్శకులు. రష్యా అంతరిక్షయాన పరిశోధనలో ఎంత సాగించిందో తెలుసుకోటానికి ఏకే నిదర్శనాలు ★



నేలమీద బెల్యయేవ్, [illegible] ఇద్దరూ.

# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

లలితా శివజ్యోతి వారి 'రహస్యం' లో మల్లాది రచనలే పాటలుగా వినిపిస్తాయి ఇంతవరకు నాలుగు పాటలు వ్రాయటం అందులో రెండు రికార్డవటం జరిగింది. 'తిరుమల గిరివాసా దివ్య మందహాసా' అన్నది ఘంటసాల పాడారు 'లలితభావ నిలయా' అన్న ముగ్గురు దేవేరుల స్తోత్రాన్ని ఘంటసాల, కోమల, వైదేహి, పద్మ, సరోజిని బృందగానంగా పాడారు. ఈ పాట రచనలో తాంత్రిక భావాను సారం మూడు దేవీమూర్తులను శక్తి రూపాలుగా పరిగణించబడి ఉండటం ఒక ప్రత్యేకత. త్వరలో రికార్డు కాబోయేవి 'నవందకృష్ణా' అనే ముకుటంతో మహాహ్వానతంగా ఉన్న ఒక తత్త్వం. "శ్రీ లలితా శివజ్యోతీ, సర్వ కామదా' అనే భక్తిగీతం తక్కిన అన్ని పాటలూ మల్లాదే వ్రాస్తారని నిర్మాత శంకరరెడ్డి అన్నారు. ఈ చిత్రంలో మరొక ప్రత్యేకాకర్షణ, సిద్ధేంద్రయోగి యక్షగానాధారంగా మల్లాది వ్రాయబోవు గిరిజా కల్యాణం, దానికి నృత్యకల్పన వెంపటి చిన్నసత్యం. ఈ నృత్యం ఉంటుందని, అందులో హంగుదార్లుగా (వంత పాటకులుగా) ఈ చిత్రానికి నృత్యదర్శకుడైన వెంపటి సత్యం, దర్శకుడైన వేదాంతం రాఘవయ్య ఆంగికాహార్యములు చూపుతారని శంకరరెడ్డి అన్నారు.

డి. బి. నారాయణ అధ్వర్యాన శివశక్తి మువీస్ వారు నిర్మిస్తున్న జానపద చిత్రానికి రెండు పాటలు వ్రాశారు. దీనికి సంగీతం కోదండపాణి. ఇదే వీరి మొదటి కలయిక. నిత్య మాతృహోత్రాణ విరాజిత పారిజాతముతోబాటు అపుడే విరియు చున్న మనముల్లిక. అందాని కిదీ నిర్వచనం

"బొబ్బిలియుద్ధం" చిత్రంలో కోట్లనంబెం సమయంలో నేపథ్యంలో యీ మాటలు వినిపిస్తాయి. "విజయనగరం కోడి, బొబ్బిలి కోడిని తరిమి తరిమి కొట్టు" అని ఈ మాటలు వ్రాసిం దెవరు, సినిమాలో చెప్పిన దెవరు, సరిగా తెల్పిన మొట్టమొదటి పాఠకునికి ఆ చిత్రంలో రెండు రికార్డులు పంపుతాను చదువరులు త్వరపడండి. రెండూ, అంటే ఆ వాక్యం వ్రాసినవారి పేరూ, ఆమాట చెప్పినవారి పేరూ సరిగా చెప్పాలి

*　　*　　*

భానుమతి పాటలను పరిచయం చేయుమని కనీసం వారానికి రెండు ఉత్తరాలైనా రాకుండా ఉండవు అన్ని పాటలేవి ? అయినా అందరి పాటకులు కోరగా కాదనలేను కదా ! భానుమతి "ధర్మపత్ని" లో పాడిన పాట ఎవరికైనా గుర్తుందా ? "అనురాగములేక ఆనందమూ ప్రాప్తించునా" ఆ రోజుల్లో ఆ పాటంటే నాకు ఎంత ప్రేమో చెప్పలేను ఆనాటిదే మరొక పాట "నిలునిలుమా నీలవర్ణా !" ఇది "ధర్మపత్ని" లోనిదో "భక్తమాల" లోనిదో గుర్తులేదు కాని పాట మాత్రం, గత ఇరవైయేళ్ల బట్టి వినకపోయినా, తలచుకుంటే మేను పులకరించేలాగు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నది

భానుమతి యుగం మళ్లీ రానున్నది మరొక పదేహేనుగేళ్ళ, ఆమె తెలుగు చిత్రసీమ నేకఛాటిగా ఏలగలదని ఎవరో జ్యోతిష్కు డన్నాడు రాబోయే చిత్రాల పెంపు చూడబోతే అలానే ఉన్నది "తోడు నీడ" లోనిది బరువైన పాత్ర అందులో రెండు పాటలు, పినరంత లాలిపాట ఉంటాయి "పల్నాటి సిరకథ" లో రెండు పాటలు, రెండు పద్యాలు. "అంతమ్మల" లో రెండు పాటలు భరణి చిత్రంలో కనీసం నాలుగైనా ఉండకపోవు కాని ఈ చిత్రం సంవత్సరాంతానికో వచ్చే యేటి మొదట్లోనో గాని విడుదల కాదనుకుంటాను.

*　　*　　*

దాదాపు సంవత్సరంబట్టి హిందీ పాటలనే మరచిపోయి, ఆంధ్రదేశంలో హిందీ వ్యతిరేకోద్యమం మొదలయిన తరువాత వెంటనే హిందీ రికార్డులను పరిచయం చేశారేమిటి రంగారావుగారూ అంటూ బరంపురంనుంచి శైలజాపాండే వ్రాశారు నాకే కాదు ఆంధ్రదేశాన్నున్న విజ్ఞులెవరికీ హిందీ భాషంటే వ్యతిరేకోద్దేశముందని అనుకోను. ఈ వ్యతిరిక్తత అంతా బలవంతపు బ్రాహ్మణార్థంగా అందరి నెత్తినాహిందీనిరుద్దే ప్రయత్నానికిమాత్రమే. ఈ విషయం గురించి ఒక మద్రాసు పాఠకుడు ఎస్. ప్రియభాషి ఈ సీసమాలనుపంపించారు.

సీ. హిందుదేశమునందు హిందీని రాజ్య భా
షగ జేయగ నెగాసె సగం పొగలు
హింది నేర్వని వారి కందరికిని హింది
పీడయ్యె కష్టమ్మె సీకబట్టె
విద్యార్థు లెల్లరావేశంబు జెంది ని
జృంభించి వెరువక మృత్యువునకు
బలియిని హిందీని ప్రజల నెత్తిన రుద్ద
వలదంచు సద్ఘోష సలుపుచుండి
శాంతి గుండెమలోన శాంతి నెల కొలిని
భ్రాంతిగొలుపుచును విశ్రాంతి లేక
కుద్దాము లేచునే యీటుమి వ్రాళ్లక
పాలించు ఘనులకు పాఠముగ
శైలు మార్గముండ్డి రాక పోకలు నిల్పి
ప్రాణమ్ములేయుద్ది ప్రతినబూని
తక్కెక భటులనే భక్షించు యమభటు
లగుచు భీకరముగా నగుచు నిలిచి
జమ్ముల మసిజేసి బాటసారుల దోచి
నిధి కుక్షి సీ నిధి నింపుకొనుచు
ప్రతిఘటోద్యమం బతి తీవ్రముగ జేయు
బద్ధ కంకణులౌచు క్రుద్ధులౌచు
పెల్లరి యుల్లముల్ తల్లడిల్లగ వల్ల
కల్లోల మొనరించి మల్లడింప
మంత్రులెల్లరు కూడి మంత్రాంగ
మొనరించి
మంది నిర్ణయ మొండు మనపదగుచు
అనీతి వెదిరించు నారాట మిది కాని
పోరాట మనుకొన్న హిందుకాదు
జనుల కలతకుకారణము హిందికాదు
దేశ భాషగ జేయు తొక్కుడొక్కు
తే గీ సవతి తల్లిని బలిమిని ఎవరికైన
తరము కాదది తలపింప తల్లిగాను
గోము మీరగ నామెయే ప్రేమజూపి
ఆదరించుదు భేదము నరయకుండ

పాఠకులు పై పద్య భావముతో ఏకీభవిస్తారనే అనుకుంటున్నాను. అయినా, ఈ భాషా సమస్యలు ... [illegible]



[illegible]






"దీన్ని జడిపిస్తే ఏదో పెద్దపార్టీని భయపెట్టినట్టుంటుంది నాకు!"




# హమేషా తమాషా

ఢిల్లీ అశోకా హోటల్ బార్‌కు ఒకనాడు ఒక భారతీయుడు, మరో విదేశీయుడు కలిసి వెళ్ళారు. అక్కడ అసంఖ్యాకులయిన భారతీయులు మద్యం పుచ్చుకొంటున్నారు.

"మీ ఊళ్ళో మీ దేశం వాళ్ళకి డ్రింక్‌లు పొయ్యరని విన్నానే" అని అడిగాడు ఆ విదేశీయుడు.

ఇంతలో బేరర్ వచ్చాడు: "మీరు ఇండియన్‌లా" అని అడిగాడు. అవునని చెప్పారు అయితే మద్యం ఇచ్చేది లేదన్నాడతను.

మిగతా భారతీయులకూ అదే ప్రశ్నవేసిన బేరర్‌కు "కాదు" అనే సమాధానాలు వచ్చాయిట. వాళ్ళందరికీ పానీయం దొరకటానికి అదే కారణం...



ఇన్నాళ్లబట్టీ ఉత్తరం వ్రాయలేకపోయినా, ఈవూరొచ్చిన మూడు రోజులకే నీ కింత పెద్ద ఉత్తరం వ్రాయవల్సి వస్తోందని నేనూ అనుకో లేదురా పిచ్చి కన్నా! ఇంతకీ ఒక్క మాటలో దానికి కారణం చెప్పాలంటే—'చంచల'! ..... నేను అతి ఘాఢంగా ప్రేమించిన చంచల!

ఆ కథావిధానం ఎట్టిదనిన

మా కంపెనీ ఒక విదేశీ కంపెనీ సహాయంతో ప్రస్తుతపు మా వ్యాపారాన్ని అభివృద్ధిచేయ నిశ్చ యించుకుంది అమాట అనుకొని వూరుకుంటే ఇంత గొడవా జరిగి ఉండేది కాదు నేను చంచ లను ప్రేమించేవాడినీ గాదు!

మా క్రొత్త ఫ్యాక్టరీని నేనిప్పుడు కూర్చొని ఉత్తరం వ్రాస్తున్న ఈ వూళ్లో కట్టాలని నిర్ణ యించుకున్నారు నిర్ణయించుకున్నారుబో మొదట్లో ఆ నేల సర్వే చేసి, దానిని చదును చేయించి, చుట్టూ ముళ్ల తీగె వేయించేందుకు గాను ఆ కంపెనీలో రెండు సంవత్సరాల క్రితం చేరిన ఈ ఇంజనీరుగాణ్ణి 'పోయిరా' తండ్రీ అని పంపాలా?

సరే! మొన్న ఉదయం ఎనిమిది గంటల పాసింజర్‌లో బయల్దేరాను— పెట్టీ, బెడ్డింగుతో! (ఈ వూళ్లో ఎక్స్‌ప్రెస్‌లు ఆగవట!) బండి సరిగ్గా ఏడిస్తే మిట్టమధ్యాహ్నం రెండు గంటలకు ఈ వూరి స్టేషన్‌లో దిగవల్సి ఉంటుంది అక్కడి నుండి రెండు మైళ్ళు కాలినడక అంటే ఒక ముప్పావు గంట కలుపుకో షుమారుగా వూళ్లోకి మూడు గంటలకు జేరగలుగుతా నన్నమాట! ఒక మిత్రుడి సలహామీద ఈ వూరి కరణంగారికి నేను 'భలానా' అని, 'భలానా' పనిమీద వస్తున్నానని, నాకో కొంప చూచి తాళంవేసి అట్టే పెట్టమని ప్రాధేయపడుతూ జాబు వ్రాసుకున్నాను ముందు గానే ఆ మహానుభావుడు నాయందు దయఉంచి, 'అలా చేసినట్టుగా' గూడా ఒక కార్డుముక్క వ్రాసి పారేశాడు వూరి మొదట్లో పెద్ద బంగళా ఖాళీగా ఉన్నదట!

ఇంకేం! చాలా సంతోషించాను అక్కడికి వెళ్ళి ఆఫీసుకు వసతి వెతికే పని ఒకటి తప్పిందన్న మాట! అది నా వసతికే గాకుండా ఆఫీసుకు గూడా సరిపోవచ్చునుకున్నాను నేను వెళ్ళి ఆఫీసు ఓపెన్ చేస్తే చిన్నగా జూనియర్ ఇంజనీర్లు, సూపర్ వైజర్లు, మేస్త్రీలు వచ్చి జేరతారు మా కంపెనీ మేనేజర్‌కు గూడా ఈ విషయం చెప్పాను ఆయన 'చూచి బాగుంటే టెలిగ్రాం ఇవ' మన్నారు ఆఫీసు ఫర్నిచర్, సర్వేకు కావాల్సిన పరికరాలు, రికార్డులు మొదలయినవన్నీ పంపిస్తానన్నాడు

నాతోపాటే అక్కడే పనిచేస్తున్న 'జాకోబ్' ని గూడా పంపేందుకు నిర్ణయించింది కంపెనీ బండి ఇంకో గంటలో బయల్దేరుతుందీ అనేంతవరకు వాడు వస్తాడనే అనుకుంటున్న నన్ను, అకస్మా త్తుగా వచ్చి, "మా ఆవిడకు కాల్లో ముల్లు విరిగింది' లాంటి వంకతో, ఆరోజు రాలేనని, మర్నాడు ఉదయానే బయల్దేరి వస్తానని, క్షమించమని, ఆఫీసుకు రిపోర్టు చేయవద్దనీ బతిమలాడసాగాడు వాడి మొఖం చూస్తే జాలి వేసి, 'సరే' నని నే నొక్కణ్ణే బయల్దేరాను. వీడు లేడు ముందు అలిస్తే ఆ కరణంగారికే, పెట్టీ, బెడ్డింగ్ మోసుకొచ్చేందుకుగాను స్టేషన్‌కు మని షిని పంపమని వ్రాసుకొని ఉండేవాడిని!

సరే! స్టేషన్లో మనిషి దొరక్కపోతాడా అని ధైర్యంతో బయల్దేరాను

మనం అనుకున్నట్లు అన్నీ జరగవ్ గదా. నే నెక్కిన రైలుబండి ఆ దారిలోనే మరో గూడ్సు బండి పట్టాలు తప్పగా ఆరు గంటల ఆలస్యంతో రాత్రి ఎనిమిది గంటలకు ఆ వూరి స్టేషన్లో ఆగింది—బిక్కు బిక్కుమంటూ కీచురాళ్ల మోత మధ్యన ఉన్న ఒక రేకుల షెడ్డు ముందు దిగాను నేను పెట్టీ, బెడ్డింగ్ పట్టుకొని

ఆగినంతసేపు పట్టలేదు తిరిగి బండి వెళ్ల టానికి బండి వెళ్లిన మరుక్షణంలో చూచు కుంటే ప్లాట్‌ఫారం మీదనేనొక్కణ్ణో మిగిలాను చేతిలో పెట్టీ, బెడ్డింగు వాటిని క్రింద పెట్టేసి నా దురదృష్టానికి (బండి ఆలస్యంగా వచ్చినందుకు) నిట్టూరుస్తూ ఏం తోచక అయోమయంగా నిల బడిపోయాను. అయితే పిండారబోసినట్లున్న వెన్నెల కాస్తంత ధైర్యం చేకూరుస్తున్నది!

తరువాత రెండు మూడు నిముషాలకు పీలగా, పొడుగ్గా ఉన్న వ్యక్తి రేగిన జుట్టును సరిచేసు కుంటూ వచ్చి నా ముందు నిలబడటంతో ఏదో పోయిన వస్తువు దొరికినట్లే అనిపించింది

నేను వెళ్లవల్సిన ప్రదేశానికి దారి వగైరాలు అడుగుదామనే సత్సంకల్పంతో నోరు తెరవబోయే లోగానే ఆయనే ఒక చిరునవ్వు పారేసి, "మీరు ఈ రైల్లో దిగారా?" అని అడిగాడు

"అవును!"

"అయితే మీ టిక్కెట్టు ఇలా యిస్తారా?"

"మీారు ?"

"నేను ఈ స్టేషన్ మాస్టర్‌ని!"

ఆపద్బాంధవుడిలా కనబడిన ఆయన గృహంలో నాపెట్టెబెడ్డింగ్‌పెట్టి ముందుకు వెన్నెల్లోకి చీల్చుకు పోతున్నట్లుగా అడుగులు వేశాను — అది తప్ప నాకు మరోదారిలేదు!

ఆయనే మర్నాడుదయం నాపెట్టెబెడ్డింగ్ కూలీకిచ్చి కరణం గారింటికి పంపుతానన్నాడు

అనుకోకుండా ఏర్పడిన ఈఉపద్రవం నాకుకాస్త చికాకు కలిగించింది అటు లేటుగా వచ్చిన రైలు బండిమీద, రాని జాకోబ్‌మీదగూడా కోపమొచ్చింది కాని చేయగలిగిందేం వుంది. కాదంటే కాళ్ళను నేలకు కొడుతూ నడవటంతప్ప!

కష్టాలల్లో పుట్టినవాడు తరువాత ఎన్నడో సుఖిస్తాడు' అన్నట్లు ఇన్ని ఇబ్బందులతో బయి ల్దేరాను కాబట్టి ఈకంపెనీ ప్రారంభంతో మనకో మంచి ప్రమోషన్ దొరక్క పోతుందా అనే ఆశ గూడా మనస్సులో మొలకెత్తింది—అదేలా వున్నా రాత్రికిరాత్రే చంచలను ప్రాణసమానంగా ప్రేమిం చాననేది మాత్రం ఖాయం!

వెన్నెల పిండారబోసినట్లున్నది ఇందాకే వ్రాశాను గదా! బాటకు రెండుప్రక్కలా సర్వితోపులు కోటగోడల్లా వరసగా అందంగావున్నయి వాటి వెనుకగా గజిబిజిగా వికృతంగా ఏవేవో చెట్లు. వాటినడుమనుండి వింతవింత పక్షుల కూతలు.

ఎంత వెన్నెలున్నా కాస్త వెన్నులోంచి భయం చలిలా పుట్టుకొస్తున్న మాటనిజమే! ఎనిమిది న్నర గంటల తరువాత నిరనంధకారంలేని ఆకొత్త బాటలో నడవాలంటె నాకేగాదు ఎవరికైనా అలాగే వుంటుందని మనస్సుకు నచ్చచెప్పుకోవటం తప్ప చేసేదేముంది. (నాగురించి నన్ను తక్కువగా ఊహిం చుకోవటం చాలాతప్పు గనుక— ఎవరో అన్నట్టు!)

అందునా ఒకటి రెండుసార్లు నావెనుగ్గా ఎవరో నడుస్తున్నట్లు ఊహించుకొని ఉలిక్కి పడి వెను దిరిగి సర్వీచెట్ల నీడలను చూచి నవ్వుకొని ముందుకు అడుగులు వేసేవాణ్ణి ఒక అందుకు నాలో నేను ఎంతగానో సంతోషించాను ఆ నీలాంటి పీల స్టేషన్ మాష్టరు ధర్మమా అని పెట్టెబెడ్డింగ్ మోసే బెడదొకటి ఆసమయంలో తప్పినందుకు!

పదుహేను నిముషాలకే ఆచెట్ల మధ్యనుండి ఊళ్లో దీపాలు లీలగా కనబడినయి ఫరవాలేదు స్టేషన్‌కు దూరంగావున్నా కరెంటు దీపాలు ఉన్నందుకు సంతోషించాను లేకపోతే ఈజాకోబ్‌గాడు వచ్చే టంతవరకు కిరసనాయిల్ లాంతర్లు గూడా తుడ వాల్సిన అవసరం ఏర్పడినా ఏర్పడవచ్చు అసలు వాణ్ణి నేను ఈరెండేళ్ళబట్టీ కనిపెడుతూనేవున్నాను. పట్టి దొంగవెధవ పని ఎగగొట్టటంలో 'ఫస్టు' వాడే!

దీపాలుచూసేటప్పటికి ఇందాకేచెప్పానే వెన్ను లోంచి ఏదోలాంటి భయంవస్తోందని అదిగూడా దూరమయింది అడుగులు ఉత్సాహంగా పడినయి. పొద్దునగా అదేదో స్టేషన్లో ఉడకీ ఉడకని నాలుగు మెతుకులు కొరికానేమో కడుపు ఆవురావురు మంటోంది ముక్కుమొఖం తెలియకపోయినా ఇంతదూరంనుండి పొద్దుబోయి వచ్చిన నాకు ఆ కరణం నాలుగు మెతుకులువేయడా అనే ఆశ మనస్సులో మొదలుతోంది

కాని మన్ని అదృష్టం మరో వైపునుండి వగ్గా వేసి లాగుతుంటే ఆకరణంలో నాకేం ఎని.

చంచల తప్పు తప్పు కథలువ్రాసే అల వాటున్న నేను గూడా అంత సూటిగా చెప్పటమా. కొద్దిగా వోపిక పట్టరా పిచ్చితండ్రీ

వెన్నెల ఉందన్నానుగదూ సర్వితోపులు గూడా ఉన్నాయ్యా అట్లా ఆ దారి ఒక మలుపు తిరిగి, వో చిన్న కాలువ మీదేసిన కర్ర వంతెన కాస్తా దాటేటప్పటికి వూరు పూర్తిగా స్పష్టంగా కనబడింది అందునా వూరికి ఓ ఫర్లాంగు ఇవతలగావున్న ఒక బంగాళా నన్ను ఇట్టే ఆకట్టేసింది! 'ఎంత బాగుంది?' అనుకున్న క్షణా నికి ఆ వూరి కరణంగారు నాకోసరం నిర్ణయించిన బంగళా ఇదేనేమో అనే అనుమానం గూడా మొలకెత్తి చిన్న చిన్నగా గారడీవాడి మామిడి చెట్టులా పెరిగిపోసాగింది చిట్ట చివరకి ఆ లైట్లు, బంగళా, దాని చుట్టూవున్న తోట చూస్తుంటే 'అదే నాకు నిర్ణయించిన బంగళా' అనే నిర్ణ యించుకొని కరణంగారు చేసిన సహాయానికి మన స్సులో ధన్యవాదాలు గూడా అర్పించేశాను

ఇంకాస్త ముందుకు వచ్చేటప్పటికి ఆ ఇంటి ప్రహరీగోడ దాపుకొచ్చేసింది ఆ తరువాత పదడు గులు వేశానో లేదో పెద్ద గేటు, గేటు ముందు 'నమస్కారమంటూ' ఓ వ్యక్తి ప్రత్యక్షం

"నమస్కారం!" కరణం మనిషిగాడు గదా?

"బండి ఆలస్యంగా వచ్చిందా బాబూ?"

"అవును!" లీవిగా అన్నాను.

"తెల్లవారిందా! ..... బాబుగారు మీకోసమే ఎదురు చూస్తున్నారు!"

"బాబుగారంటే?" సంశయిస్తూనే అడిగాను.

"అదే......రఘునందనం బాబుగారు!"

అంటే కరణంగారు కాదన్నమాట...... ఈ ఇంటి యజమాని అయి ఉండవచ్చు!

ఉల్లాసంగా, తనివితీరా బంగళా ముందున్న తోటను చూస్తూ అడుగులు ముందుకు వేశాను.

బయట గేటుకు, వరండాకు మధ్య సుమారు ఐదారు వందల గజాల దూరం ఉంటుంది. అసలు ఆ బంగళా ఆకారాన్ని చూస్తుంటే ఒక నిర్ణయం ప్రకారం కట్టినట్లున్నది. రేపొద్దున జనరల్ మేనేజర్‌కు టెలిగ్రాం ఇస్తే సరి! ......... ఒకపని చాలా సులువుగా అయిపోయింది.

పాలరాతి గచ్చుమీద శబ్దం చేయకుండా అడుగులు వేస్తున్నాయి నా బూట్లు!

గేటు వద్దనుండి నన్ను అనుసరించిన ఆ వ్యక్తి, దగ్గరకు వేసివున్న తలుపును నెట్టి లోపలికి చూస్తూ, "బాబుగారు వచ్చారు!" అన్నాడు.

నాకు ఆ పెద్ద హాలును చూచేటప్పటికి కళ్ళు జిగేలుమన్నాయి.

అది జమిందారుల గృహం కాదుగదా అని పించింది! — అటువంటి గృహంలో కాలు పెట్టటానికి కొన్ని కాళ్ళు గూడా తడబడిన మాట వాస్తవమే!

"రండి! ... రండి!......" అన్నారు. ఆయన లేచి నిలబడి సాదరంగా ఆహ్వానిస్తూ.

అంత అంతస్తులో ఉన్న వ్యక్తి ఒక సాధారణ ఇంజనీరు నైన నన్ను ఆలా ఆహ్వానించటం నాకే గర్వకారణమైంది

# చంచల

చిరునవ్వుతో "నమస్కారమండీ!" అన్నాను.

"నమస్కారం బాబు! బండి ఆలస్యంగా వచ్చిందా? ఇదుగో ఈ రైళ్ళతో వచ్చిన చిక్కే ఇదయ్యా!" అన్నారు ఆయన నవ్వి.

ఆనవ్వులో ఆయన వెడల్పైన ముఖం మరింత విశాలమయింది. గోల్డు ఫ్రేమ్ కళ్ళజోడు తళుక్కున మెరిసింది. నెరిసిన తెల్లని జుట్టు వింతగా నిక్క బొడుచుకుంది.

నేను లోపలికి అడుగులు వేశాను.

ఆయన సోఫా చూపిస్తూ "కూర్చో!" అన్నారు.

కూర్చొని తలెత్తి మెరిసిపోయే ఆ బంగళాను మరోసారి వింతగా చూచాను

"కరణంగారు వ్రాశారు నేను చాలా ...."

"ఇదుగో మీ కుర్రవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది. పొద్దున లేచినప్పటినుండి ప్రతి వాళ్ళతోటీ వ్యాపార సరళిలో మాట్లాడటమే తప్ప ఒక మంచీ మర్యాదలేదు .... పొద్దునవగా బయల్దేరావ్ . ..ఎండల్లా మొఖాన కొట్టుకొని ఇప్పటికి గమ్యం చేరావ్. . కాళ్ళు కడుక్కో కాఫీని మంచి నీళ్ళు త్రాగు. . .డొక్క ఏడుస్తుండాలి ......కడుపు నింపుకో తరువాత అన్నీ సావకాశంగా మాట్లాడుకోవచ్చు!" అని ఫెళ్ళున నవ్వి, క్షణంలో ఆపేసి తడబడుతూ, "అరెరె! ఎంత పని జరిగిపోయింది. . నీ వొచ్చి ఇంత సేపయిందా!. .....మా అమ్మాయిని నీకు పరిచయం చేయనేలేదుగదూ? నాది ఒట్టి మందబుద్ధని అది తిడుతూనే ఉంటుంది కానీ ఏం లాభం? ఒక్క క్షణంలో పిలుస్తా ఉండు . ..ఇట్టే వస్తుంది .. ముందు పరిచయం తరువాతే నీవు మంచినీళ్ళు త్రాగటం గూడా ఆ . ." అని ఆయన వాక్ప్రవాహానికి చిన్న ఆనకట్ట వేసి, "చంచలా! చంచలా!" అని పెద్దగా పిల్చారు

నేను ఆయనను ఆయన మాటలను వింతగా చూస్తూ అలాగే కూర్చుండిపోయాను.

"ఓ చంచలా! త్వరగా రావాలి ."

చల్లని పిల్లవాయువులు గదిని చుట్టుముట్టుతున్నయి. తోటలోని సంపెంగల సువాసన వాయువు మిళితమై తలను మత్తెక్కిస్తోంది. ఎక్కడో మృదువైన అడుగుల సవ్వడి కోకిల కంఠంతో సన్నని ఆలాపన......

నోరు తెరుచుకొని అలాగే లోపల గది కర్టెన్ వంక చూస్తూ కూర్చున్నాను

మృదువైన ఎర్రని సన్నని వేళ్ళు కర్టెన్‌ను ప్రక్కకు తొలగించినయ్.

మరుక్షణంలోనే ఒక అపరంజి బొమ్మ తళుక్కున మెరిసింది!

నేను ఆమెను చూస్తూనే కొయ్యబారి పోయాను.

ఆమె మానవ స్వరూపిణా లేక దేవతా స్త్రీనా?

తెల్లని చీరెలు, తెల్లని జాకెట్టు, నల్లని ఒత్తైన కురులతో అందానికి ప్రతిబింబంలా, అజంతా శిల్పంలా ఆమె ఆమె ఆ చంచలను చూస్తుంటే నా కళ్ళు తిరిగినయ్ .

"వారు రానే వచ్చారు నీకు పరిచయం చేద్దామని పిలిచాను ఈలారా!" అన్నారు

ఆమె అడుగులు, ఎక్కడ పడిపోతాయో అన్నంత మెత్తనగావేసి నా ఎదురుగా నిలబడింది ఆ హాలు మధ్యగా నిలబడ్డ ఆమె మరో మెర్క్యూరీ బలుబులా తళుక్కుమంటోంది

"మా అమ్మాయి .. చంచల!" అన్నారు నావైపు తిరిగి

"నమస్కారం!" అన్నాను నాకు తెలియకుండానే నా నోరు పలికింది చేతులు కలిసినయ్

"నమస్కారం!" వీణ మీటింది

"వీరిని గురించి నీకు చెప్ప నక్కరలేదు గదా?"

ఆమె సన్నని నవ్వుకు ఆ గదిలో వెన్నెల కురిసింది!

"ముందు చల్లటి నీళ్ళు పంపు. . గొంతు తడార్చుకొని పావుగంట విశ్రాంతి తీసుకున్న తరువాత స్నానానికి నీళ్ళుతోడి కబురంపు ఈలోగా కొన్ని మేము మాట్లాడుకుంటుంటాం!"

"సరే!" అన్నది వెనుదిరుగుతూ

ఆమె ఆ గదిలోంచి దాటి వెళ్ళినా నేను వాకిలి వైపే సభ్యతను గూడా మర్చిపోయి చూస్తుండి పోయాను

తరువాత ఐదు నిముషాలకు ఆ ముసలాయన నన్నేమైనా అపార్థం చేసుకుంటాడేమోనని వూహా బెదిరి తలవంచుకునేటప్పటికి ఆ అపరంజిబొమ్మను గురించి ఆయన ఎత్తనే ఎత్తారు!

"చంచల ఉంది చూచారా! అందానికి ప్రతిబింబం అనుకో అంతేగాదు సుగుణాల రాశి గూడా! " అని ఒక్క క్షణం నా మొఖంలోకి ఆత్రంగా చూచి "మా అమ్మాయి అని నేను గొప్పకు చెప్పుకుంటున్నాను అనుకునేవ్ నిజం!



అది అక్షరాల నిజం...దానిదేంతా దాని తల్లి పోలికే!'' అని ఒక్క నిట్టూర్పు విడిచారు

ఆయన మొఖం క్షణంలో నల్లబడిపోయింది తలవాల్చుకున్నారు చిటికిన వ్రేలితో కళ్ళక్రింద రాచుకోవటంతో బహుశ కన్నీరు గూడా తుడుచుకుంటున్నారేమోననిపించింది నాకు

''ఇదుగో చూడు ఇంతకీ మర్చిపోయాను మతిమరుపులో నన్ను మించినవాడు లేనేలేడు . ఆ నీ పేరూ అడగనేలేదుగదూ?''

నా పేరు చెప్పాను

''శేషగిరీ! ఒక్కమాట చెప్పు నాకు నా భార్యది నాది ఒక్క కులం కాకపోవచ్చు . మేమిద్దరం పెద్దవాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా వివాహం చేసుకోనూవచ్చు! అంతమాత్రాన ఆ కసంతా చంచలమీద ఎందుకు తీర్చుకోవాలి?''

నేను అదిరిపడ్డాను చంచల చంచలమీద ఎవరికైనా కసా?

''ఏమైంది?'' అన్నాను ఆత్రంగా.

''ఏమవుతుంది? నాతోబాటే నా చంచలను గూడా బహిష్కరించారు నా వాళ్ళంతా అంతకంటే చేయగలిగింది మాత్రం ఏముంది వాళ్ళు!'' ఒక నిశ్వాసం విడిచారు ఆయన

నాకు ఆయన ధోరణి పూర్తిగా అర్థం కాకపోయినా, అది నన్నంత గాయ పరిచేది కాకపోవటంతో 'వూ' కొట్టి వూరుకున్నాను

''పోనియ్యి! ఇవాళ నా చంచలకు పెండ్లి కాకుండా అయితే చెయ్యగలిగారు ఇంత దూరం వచ్చానా? ఇక్కడైనా పెండ్లి కాకుండా ఎట్లా అడ్డు పడతారో చూస్తాను ఏవనుకున్నారు వెధవలు వాండ్ల సంసారాలు కొనెయ్యగల తాహతుంది నాకు! ఆ '' అని ఒక్క క్షణం ఆగి, ''నీవు చెప్పు శేషగిరీ! మా చంచలను పెండ్లి చేసుకునేందుకు ముందుకెవడూ రాడంటావా?'' అన్నారు

అలాంటి ప్రశ్న వస్తుందని నేననుకోలేదు కాస్త ఉక్కిరి బిక్కిరి అయిన మాట వాస్తవమేగాని, తొందరపాటును నిగ్రహించుకొని, ''అదేంమాట అసలు వచ్చినవాడు వెనక్కు వెళతాడా?'' అన్నాను హుషారుగా అనుకోకుండా ఆ మాటలు అలా వెలువడినయి

''అలా అన్నావ్ బాగుంది! . నిజమైన మాట చెప్పావు నేనూ అదే అంటాను అమ్మాయితో అయినా ఒక్కటి చెబుతాను మనస్సులో పెట్టుకో దానికున్న గుండెధైర్యం నాకు గూడా లేదనుకో!''

ఇంతలోనే లోపలినుండి పని మనిషి వచ్చింది. ''నీళ్ళు తోడాను బాబూ!'' అంటూ.

లేచి స్నానం చేసి, గుడ్డలు మార్చుకొని భోజనాలముందు కూర్చొనేటప్పటికి తరువాత అరగంట పట్టింది

ఈ అరగంటా నేను చేస్తున్న పనులమీద కంటే, ఆమె అందమైన కళ్ళ కోసరమే నా కళ్ళు ఆత్రంగా వీక్షిస్తున్నాయి

నేను వచ్చేటప్పటికి భోజనాల హాల్లో టేబుల్ మీద అన్నీ అమర్చి ఉన్నాయి రఘునందనంగారు నన్ను చూస్తూనే లేచివచ్చి డైనింగ్ టేబుల్ ముందు వచ్చి కూర్చున్నారు. ఆమె కూడా వచ్చి నా ఎదురుగ్గా కూర్చున్నది

ఆమెను చూస్తుంటే ఆమె కళ్ళను చూస్తూంటే ఎప్పటినుండో తిండికోసరం తహతహలాడుతున్న నేను ఆకలిని గూడా మర్చిపోయాను.. ఎంత కాలమైనా నిద్రాహారాలు మాని ఆ కళ్ళను చూస్తూ కూర్చోగలను .. చంచల కళ్ళలో ఒలికే అమృతమే నాకూ అన్న పానీయాలు!

''ఈ రోజున వంటంతా స్వయాన చంచల చేసింది అసలెవరైనా అతిథులు వస్తే ముందు చంచలే వంట ఇంట్లో కూర్చుంటుంది . ..!'' అన్నారు నవ్వి రఘునందనంగారు

''ఫో నాన్నా! నువ్వు మరీను !''

''చూశావా! శేషగిరీ! స్త్రీకి సిగ్గే సింగారమన్నారు ఇప్పుడు చూడు మా చంచలను!'' ఆయన కళ్ళు గర్వంతో మెరిసి పోతున్నయి

చంచల సిగ్గుతో మరింత ఎఱ్ఱబడింది

''అసలు సిగ్గుకు చంచలే అందం తెస్తున్నదని చెప్పాలి!'' హుషారుగా ముందుకు జరిగి అన్నాను

ఉపాధ్యాయుడు ఆతిథ్యమిచ్చువానిని ఇంగ్లీషులో ఏమంటార్రా?

విద్యార్థి : 'హోస్ట్' సార్.

ఉపా : 'అతిథి'ని ఏమంటారురా?

రెండవ విద్యార్థి . 'ఘోస్ట్' సార్

రత్నవర్మన్ (పానుకుమాడు)

''ఇదుగో ఇద్దరూ ఒకళ్ళ కొకళ్ళు వంత పాడుకుంటూ కూర్చుంటే నేను కంచంముందు నుండి లేచిపోయేది ఖాయం!''

''అబ్బెబ్బే! ఆ పని మాత్రం చేయబోకు . ఇక చూసుకో మీ నాన్నంటే ఎంత బుద్ధిమంతుడో నిరూపిస్తాను .... అయ్యా శేషగిరిగారూ! నా నోటికి మా చంచల తాళం బిగించింది కాస్త మీరు గూడా కట్టడిలో ఉండకపోతే మీకూ ఏదో శిక్ష విధించిందన్నమాటే!'' అని ఫక్కున నవ్వి దబదబా అన్నం కలుపుకొని తినసాగారు తలవంచుకొని

క్షణం సంశయించినా ధైర్యం చేసి అన్నాను . ''చంచల విధించే శిక్షను స్వీకరించేందుకు తయారుగా ఉన్నాను అందుకు భయపడి నేను చెప్ప దలుచుకున్నది మాత్రం చెప్పకుండా వూరుకోలేను!''

క్షణక్షణానికి చంచల నాకు దగ్గరవుతున్నదేమోననిపించింది ఆమెమీద తెలియని అధికారం గూడా నాలో గూడు కట్టుకుంటున్నదేమోననిపించింది.

''అయితే తింటున్న అన్నం వదిలేసి వెళ్ళిపోవాలనుకుంటున్నారా నేను!'' అన్నది తలెత్తి సూటిగా చూస్తూ.

సమాధానం చెబితే ఎక్కడ చూపు మార్చుకుంటుందోనని కొన్ని క్షణాలవరకు నేను సమాధానం చెప్పకుండా అలా ఆమె కళ్ళల్లోకి చూస్తూనే ఉండిపోయాను

నన్ను ఏదో తెలియని శక్తి చుట్టు ముట్టింది. బాహ్య జ్ఞానాన్ని మర్చిపోగా ఈ ప్రపంచంలో ఒక్క చంచల ముఖమే నాకు దృష్టిపథంలో కనబడుతోంది కన్నార్పలేకపోయాను చూపు మార్చుకోలేకపోయాను ఆమె కళ్ళను చూస్తూ అలాగే కూర్చుండిపోయాను

''అదేవిటి? అడిగిన దానికి సమాధానం చెప్పకుండా కొయ్యబొమ్మలా కూర్చుండిపోయారు!''

''చంచల!'' గొణిగాను ''లేదు చంచలా! నేను అశక్తుణ్ణి నేను నీకు సమాధానం చెప్పలేను . నీవే శిక్ష విధించినా అనుభవించేందుకు సంసిద్ధుణ్ణి!''

''సరే! మీరేం చెబుతున్నారు మీకే అర్థం గావటం లేదల్లే ఉన్నది ముందు భోంచేయండి తరువాత తీరికగా చెబుదురుగాని!'' ఫక్కున నవ్వింది

నేను స్మృతిలోకొచ్చి సిగ్గు పడ్డాను తలెత్తి పక్కకు చూస్తే ఉలిక్కిపడ్డంత పనయింది

రఘునందనంగారు అక్కడలేరు!

''నాన్నగారు ? ''

నా ప్రశ్న సగంలోనే ఉండగానే ''లేచి వెళ్ళి అరగంటయింది!'' అని మరోసారి నవ్వులు కుమ్మరించింది

ఆతృతతో చేతి గడియారం చూచుకున్నాను. నేను భోజనానికి కూర్చుని అప్పటికి ముప్పావు గంట అయింది

నాతల సిగ్గుతో కృంగిపోయింది రఘునందనంగారి దృష్టిలో నన్ను నేను హీనపరుచుకోవటానికి అంతకంటే జరగవల్సిందేమి ఉన్నది తలవంచుకొని గబగబా తినేసి టవల్‌తో చేతులు తుడుచుకుంటూ హాల్లోకు వచ్చేశాను

''చాలా రోజుల తరువాత ఈ రోజున నేను చంచల ముఖంలో నవ్వును చూచాను శేషగిరీ! నేను అదృష్టవంతుణ్ణి! ప్రతివారు మనస్సు ఇచ్చి మాట్లాడలేరు! నిజంగా ఈ రోజు నాకు సుదినం!''

ఉలిక్కిపడి పక్కకు తల తిప్పాను

అద్దం ముందు నిలబడి వక్క పలుకు నములుతున్న రఘునందనంగారు కనబడ్డారు

''అమ్మా! చంచలా! శేషగిరికి తమలపాకులివ్వు!''

మరుక్షణంలోనే చంచల ప్రత్యక్షమయింది— చేతులో ఆకులు మొదలయిన సామగ్రితో నిండిన వెండి పళ్ళెంతో!

ఆమెను చూస్తూనే చిరునవ్వు నవ్వాను. సమాధానంగా నవ్వింది ఆ నవ్వు నాలో తెలియని ఉత్సాహాన్ని బలాన్ని కలిగించింది నన్ను ఆ గృహంలో అత్యున్నత స్థానంలో ఉంచింది!

''అసలు ఆ స్థానం నాదేనా?'' ఒక్కక్షణం అమాయకపు ప్రశ్న — మరు క్షణంలోనే ''ఆ

చెమటకాయలనుండి వెంటనే ఉపశమనము పొందుటకు

# జాన్సన్స్ ప్రిక్లీ హీట్

## సబ్బు మరియు పౌడరు

**జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు•**

రోగ క్రిములను అడ్డును. చెమటకాయల వలన కలుగు దురదకు
కారణమైన చర్మముమీది సూక్ష్మ రంధ్రములు మూసుకొని పోవుటను అడ్డును.
దీనిని వాడితే మీరు చల్లగా, సౌఖ్యముగా, ఉత్సాహముగా ఉంటారు!

**జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరు•**

సౌమ్యమైనది. విశ్వసనీయముగా గుణము కలిగిస్తుంది. శీతలమైన సువాసనగలది.
చెమటకాయలనుండి వెంటనే ఉపశమనము కలిగిస్తుంది. ఎండలలో
మీరు చల్లగా, హాయిగా ఉండేలా చేస్తుంది!




• ట్రేడ్ మార్కు.



**జాన్సన్ అండ్ జాన్సన్**
ఆఫ్ ఇండియా లిమిటెడ్
30, ఫోర్బెట్ స్ట్రీట్, బొంబాయి-26

JWT-II-3707

'ఉన్నత స్థానానికి నేను తగుదునా?'' అని నన్ను
వవాలు చేస్తూ ఇంకో ప్రశ్న!

ఏవని చెప్పగలనురా బాబు?

నన్ను నేను మరిచి పోయాను అక్కడ ఉన్నది
ఆ చంచల ముందు ఉన్నది ఈ శేషగిరిగాదు
ఎవరో . . ఏ లోకానికి చెందినవాడో గూడా
తెలియని వ్యక్తి.. నిజం చంచల— అనలు ఆమె
కళ్ళు అలాంటివిరా కళ్ళుగాదు.. . బాబు...... అవి
అయస్కాంతాలు!

రఘునందనంగారు చిన్నగా దగ్గారు

ఆయన దగ్గుకు నేను ఉలిక్కి పడ్డమాట
వాస్తవమే అంతేకాదు తత్తర పడ్డాను గూడా .
తల వంచుకొనివచ్చి తప్పు చేసిన వాడిలా ఆయన
ముందు కూర్చున్నాను

''అమ్మా! చంచలా! . శేషగిరికి నిద్ర వస్తున్న
ఢల్లే ఉన్నది అందునా పగలంతా రైలు
ప్రయాణమయ్యే. వెళ్ళి అతని గదిలో పక్క
వేయించరాదా?'' అన్నారు

''పక్క ఇదివరకే వేయించాను!'' అన్నది నా
వంక చూచి చిన్నగా నవ్వి

నాలోని సంతోషం నా మొఖంమీది నవ్వుకు
హేతువయింది.

నేను లేచి నిలబడ్డాను.

నా అంతరంగాన్ని గుర్తించి రఘునందనంగారు
గూడా నిలబడి నా కోసరం కేటాయించిన గది
వైపు అడుగులు వెయ్యసాగారు

నేను ఒక్క క్షణం వెనుకనే ఆగి, 'ఈ రాత్రికి
ఇదే ఆఖరి దర్శనం' అన్నట్లుగా ఒక్కసారి చంచల
ముఖంలోకి నవ్వి ముందు వెళుతున్న రఘునందనం
గారిని కలుసుకున్నాను

గదిలోకి వెళ్ళి పడుకున్నానన్న మాటేగాని
నాకు నిద్ర పట్టలేదు చంచల కళ్ళే ఆ చీకట్లో
నా కళ్ళముందు తారట్లాడుతున్నాయి రెండు
దీపాల్లా నేను కళ్ళు మూసుకొని మరింత
చీకటిని ఏర్పరుచుకున్నా వాటిల్లో దివ్యత్వం పెరుగు
తున్నదేతప్ప తగ్గటంలేదు నేను ఆ కళ్ళనుండి
తప్పుకోలేను అవి నన్ను వెంటాడుతున్నాయి
తరుముతున్నాయి
నాకు మారో మార్గంలేదు.

ఆ కళ్ళల్లో వెలుగు ఉన్నది దివ్యత్వమున్నది
అమృతమున్నది వెన్నెలున్నది—దీనత్వమూ ఉన్నది
ఆ కళ్ళను నేను మరువలేను జీవితంలో ఆ కళ్ళు
నా కళ్ళకు జోడైతే నాకు ఇంకేం కావాలి?

నేను ఏ పని మీదైతే ఆ వూరు వచ్చానో అది
గూడా నాకు ఆ క్షణంలో గుర్తులేదు నేను
సర్వం మర్చిపోయి 'చంచల' అనే ప్రపంచంలో
సంతవ్యాప్తమయిన వెలుగు నయ్యాను!

ఏలాంటి దిన మిది?

నీటిలో రాయి విసిరినట్లు నా ఆలోచనల
బుపుతీశాను.

రఘునందనంగారు!

ఆయన తలుపు తీసి నన్నుచూస్తూనే, ''నిన్ను
ఈసమయంలో అనవసరపుమాటలతో విసిగించ
దలుచుకోలేదు శేషగిరి! . ఒక్కమాటచెప్పు నీకు
చంచలను వివాహం చేసుకోవటం యిష్టమేనా?''
అన్నారు.

ఆయన అంటున్నదేమిటి?..... .....

ఆ ప్రశ్నకు నేను ఉక్కిరి బిక్కిరి అయ్యాను
ఉత్సాహమూ, సంతోషమూ సముద్రతరంగాల్లా
నాలో ఉవ్వెత్తున లేవగా నన్ను నేనే మర్చిపోయాను
ఏమిటిది? కలా? నిజమా? సామాన్య ఇంజ
నీరునయిన నన్ను జమిందారుల హోదాలో ఉన్న
రఘునందనంగారు అతిలోక సౌందర్యవతియైన
తన కూతురుకు, తన ఆస్తికి సర్వాధికారిణికి,
ఒక్క పూట పరిచయంతోనే నా వెనుక ముందులు
ఆలోచించకుండానే భర్తగా ఎన్నుకోవటమా?

నేను విభ్రాంతి చెందాను

వెలుగు విరజిమ్మే కళ్ళతో, ''నేను తగుదునా?''
అన్నాను నా గొంతు వడబడింది

రఘునందనంగారు అత్యంత ఆహ్లాదాన్ని వ్యక్త
పరుస్తూ, నా భుజం తట్టి ''నాకు హోదా,
ధనమూ కాదు కావాల్సింది శేషగిరి! మంచి
మనిషి కావాలి! అంతే!'' అని చటుక్కున వెను
దిరిగి నా చేయి పట్టుకొని ఎడి వడిగా లాక్కు
వెళ్ళారు.

ఆయన వెంట నన్ను నేను మరిచి హాల్లోకి
వెళ్ళాను

అప్పటికే అక్కడ ఒక బంగారు బొమ్మ
నా వంక చూపులు తూపుల్లా గురిపెట్టి నిలబడి
ఉన్నది ఆమె చంచల!—కాదు బంగారు బొమ్మ! .

కొన్ని నిముషాల క్రితం చూచిన చంచలకీ,
ఇప్పటికీ ఎంతో తేడా ఉన్నది

తెల్ల చీరె బదులు గులాబీ చీర, తెల్ల జాకెట్టు
గుండ్రటి బొట్టు స్థానే అర్ధ చంద్రాకారంలో
తిలకం బంగారు మెడను కప్పేస్తూ మోయ
లేనన్ని బంగారు నగలు నడుముకు బంగారు
వడ్డాణం చేతికి కట్టే వంకలు ముందుకు
వేసుకున్న పొడుగాటి జడలో జడబిళ్ల బంగారు
కుచ్చులు . .

ఆమె నిజంగా . నిజంగా ........ బంగారు
బొమ్మే!

అడుగులు నాకు తెలియకుండానే ముందుకు
పడుతున్నాయి కళ్ళల్లో కాంతి దేదీప్యమానంగా
వెలుగుతోంది ఒక వైపు ఏదో అర్థంగాని శక్తి
నామీద తడబాటుగా వణుకుతోంది లేత ఆకుల్లా
వణుకుతున్న ఆమె పెదిమల్లాగానే నా పెదిమలూ
వణుకుతున్నాయి అత్యంత బలంగా ఒత్తి ఒత్తి
అడుగులు వేస్తూ ఆమె ముందు వెళ్ళి నిలబడి
కెంపులు కురిపిస్తున్న చంపల్లోకి వెన్నెల కాలవాల
మయిన నేత్రాలలోకి రెప్ప వాల్చకుండా చూస్తూ
శిలయిపోయాను.

ఆమె చిన్నగా నవ్వింది—ఆనందంతో, అందానికి
అతిశయంతో

నేనూ నవ్వాను—ఆమెను పొందబోతున్న
గర్వంతో

మరొక్కడుగు ముందుకువేసి దొండపండ్ల
లాంటి ఆమె పెదాలమీద చిన్నగా ముద్దు పెట్ట
బోయాను

చేపలా కళ్ళు రెప రెప లాడిస్తూ, ''నాన్న
గారు!'' అన్నది కళ్ళెత్తి గొణుగుతున్నట్లుగా

కలవరపడుతూ వెనుదిరిగాను వూహా ప్రపంచం
నుండి బయటపడి!

అక్కడెవ్వరూ లేరు!

చంచల ఫక్కున నవ్వింది నన్ను చూస్తూ.
ముత్యాలు రాల్చింది సంపెంగలు వెదజల్లింది.
పన్నీరు చిలకరించింది

చటుక్కున నా చేయి పట్టుకొని ''అంత
తొందర గూడదు!'' అన్నట్లుగా తల తిప్పుతూ
ముక్కుమీద వేలేసుకుంది

చిన్నగా నా ముందు నడుస్తున్న ఆమెను అడు
గులో అడుగు వేసుకుంటూ అనుసరించాను.
ముందుగాఉన్న నా గదిలోకి దారితీసి నేను గదిలో
కాలు పెట్టగానే, ఆమె వెనుదిరిగి గడప దాటింది.



"హాయిగా నిద్రపోండి! గుడ్‌నైట్!" అని తలుపులు మూసి ఒక్క క్షణం గూడా ఆగకుండా వెళ్ళిపోయింది వడివడిగా

లిప్తకాలం వస్సెవరో హిమాలయాలమీద నుండి క్రిందకు త్రోసినట్లనిపించింది కాళ్లీడ్చుకుంటూ వెళ్ళి మంచంమీద నడుం వాల్చాను

బుర్రలో లక్ష ప్రశ్నలు, లక్ష ఆశలు, లక్ష కోరికలు, లక్ష ఆలోచనలు—ఉక్కిరి బిక్కిరి అయ్యాను

నేను రేపు చెయ్యవల్సిన ఉద్యోగ విధి నిర్వహణమీదగాదు—చంచలమీద!

తరువాత ఎప్పుడు నిద్ర పట్టిందో నాకు తెలియదు!

సూర్యుడు కళ్ళలోకి సూదులతో పొడుస్తుండగా ఎవరో హడావుడిగా నన్ను వూపుతూ నిద్ర లేపగా ఉలిక్కిపడి లేచాను—చంచలే అయిఉంటుందనుకుంటూ!

కాదు—ఎవరో క్రొత్త వ్యక్తి!

"ఎవరూ?" అంటూ తలెత్తాను

ఎందుకో ఒళ్ళంతా నెప్పులుగా ఉంది తల పోటు పుడుతుంది శరీరానికి ఏవో గట్టిగా వొత్తుకుంటున్నాయి బూజర బూజరగా ఉన్న కళ్ళను రెండు చేతులతో తుడుచుకుంటూ మరింత తీక్షణంగా చూచాను.

ఏవిటిది?

నిజమా?

నాకు కళ్ళు తిరిగినయి సర్వం అయోమయమయింది నే నెక్కడున్నాను? బూజుపట్టి, గబ్బిశాలు ఎగురుతూ, కంపు గొడుతున్న, వల్లిటి విరిగిన గోడల నడుమ . రాళ్ళలో దుమ్ములో ధూళిలో కటిక నేలమీద

భయంతో గుండె ఆగినంత పనయింది.

రాత్రి రాత్రి నేను గడిపినది . ???

భగవాన్!

ఒక్క ఉదుటున బయటకు దూకి, అక్కడ ఉన్న ఇద్దరు ముగ్గురు వ్యక్తులను గూడా తప్పించుకొని గేటు దాటి రోడ్డుమీద నిలబడ్డాను!

వెనుదిరిగి చూస్తే ఏవున్నది?

ఊరికి కొన్ని ఫర్లాంగులదూరంలో కొన్ని దశాబ్దాలనుండే ఉపయోగించని, కూలిపోయేందుకు సిద్ధంగా పాత రెండంతస్తుల మేడ అక్కడక్కడా విరిగి పడిపోయిన కాంపౌండ్‌వాల్ . చదలు పట్టిన గేట్లు అర్థం పర్థంగాని గీపెట్టే చెట్లలో విండిన అవరణ!

రాత్రంతా గడిపింది ఈ బంగాళాలోనా?

కళ్ళు గిర్రున తిరిగినయ్

నన్ను నిద్రలేపిన ఆ వ్యక్తులు బయటకొచ్చారు

కాస్త సంశయిస్తూ అడుగు ముందుకువేసి అడిగాను, "మీ రెవరు?"

అందులో ఒక వ్యక్తి "వీరు ఈ వూరు కరణంగారు!" అన్నాడు

వయస్సు మళ్ళిన కరణంగారు చిన్నగా నాకు దగ్గరగా వచ్చి నా భుజంమీద తడుతూ "గాభరా పడబోకండి! ఇంటికి వెళ్దాం పదండి!" అన్నారు

ఎండాకాలమవటంతో ఎనిమిది గంటలకే ఎండ తీక్షణ రూపం దాల్చింది. గాలి తన శక్తిని చూపిస్తూనే ఉన్నది.

# చంచల

తలవంచి ఒక్కసారి నన్ను నేను చూచుకున్నాను—లాగూ చొక్కా మట్టిపట్టి తోళ్ళయినయి అక్కడక్కడా చిరుగులు గూడా నన్ను హేళన చేస్తూ కనబడుతున్నయి

ఇంకా నాకు గుండె దడ తగ్గలేదు ఎగిరెగిరి పడే ఉచ్ఛ్వాశ నిశ్వాసాలే అందుకు నిదర్శనం అటు కాళ్ళు చేతులు గూడా రాత్రి సంఘటనలను గుర్తుకు తెస్తూ వణుకుతున్న మాట వాస్తవమే

బెదురుతున్న కాళ్ళతో ఆ పడిపోతున్న పాత కొంపను చూస్తున్న నేను, 'పదండి' అన్న కరణంగారిని చిన్నగా అనుసరిస్తూ అడుగు వేయసాగాను

"పొద్దున స్టేషన్‌మాస్టరుగారు పంపిన పెట్టి బెడ్డింగ్‌ను చూచి ఆశ్చర్యపోయాను ." కరణంగారు చెప్పసాగారు "వాడా మీరు రాత్రే బయల్దేరి మా ఇంటికి వచ్చారని చెబుతున్నాడు! వాడి మాటలు ఎట్లా కాదనేది నాకేం పాలుపోలేదు స్టేషన్ మాస్టర్‌తో మా ఇంటికి అని చెప్పి బయల్దేరిన మీరెక్కడకు వెళతారు అందునా మీ కింకెవరెలా తెలుసని వెళతారు ఆలోచించాను చటుక్కున ఈ బంగళా సంగతి స్ఫురణ కొచ్చింది ఇంతకు క్రితం గూడా ఒకటి రెండు సంఘటనలు ఈలాంటివి జరిగినయ్ వెంటనే ఆలస్యం చేయకుండా మా ఇద్దరు పాలేర్లను వెంట బెట్టుకొని ఇలా వచ్చాను!"

ఆయన చెబుతున్న దేవిటో నా కర్థం గాలేదు ఇంకా చంచల కళ్లే నా ముందు తారట్లాడుతున్నాయి రఘునందనంగారి నిక్కబొడుచుకున్న తెల్లటి జుట్టే నన్ను నిక్కి నిక్కి చూస్తోంది

మొఖాన బట్టిన చమటను చేతులతో తుడుచుకుంటూ కరణంగారిని అడిగాను "ఆ బంగళాను గురించి నాకు చెబుతారా? ఎందుకలా అయింది దాని వెనుక కథ ఏవిటి?. అసలు దయ్యాలంటేనే నమ్మకంలేని నాకు ఇది జీవితంలో మరువలేని సంఘటనే! .... నాభావాలకు గొడ్డలి పెట్టు!"

"అది ఒక కథ శేషగిరిగారూ! పదిహేను సంవత్సరాల క్రితం జరిగిన కథ "

"మీరు టూకీగా చెప్పినా నేను అర్థం చేసుకోగలను ఎలాగంటారేమో, మీకు జీవించి ఉండగా ఆ వ్యక్తులతో పరిచయం ఎలా కలిగిందో .. నాకూ వాళ్ళతో అలాగే పరిచయం కలిగింది . అయితే చచ్చిపోయిన తరువాత అనుకోండి!" అని చిన్నగా నవ్వి, "ఇద్దరూ చచ్చిపోయారని ఎందుకు అంత గట్టిగా చెబుతున్నానంటే—అందులో ఎవరు బ్రతికిఉన్నా ఆ కొంప ప్రస్తుతం అలాంటి స్థితిలో ఉండేదిగాదు—అందునా నగ్న సత్యంలాంటిది మరోటి గూడా ఉన్నది—మనుష్యులు చస్తేగాని దయ్యాలవ్వరనేది!" ఈసారి కాస్త గట్టిగానే నవ్వాను

" ఆయనది ఏ వూరో ఎక్కడినుండి వచ్చారో నాకైతే తెలియదు ఆయన చెప్పలేదు గూడా గాని పదిహేను సంవత్సరాల క్రితం గాబోలు ఎనిమిది సంవత్సరాల కూతురితో ఈ వూళ్లో కాలు పెట్టారు ఆ రోజుల్లోనే ఒక్క సంవత్సరం లోగా అత్యంత అధునాతనంగా ఈ బంగళాను కట్టించారు నేను ఈ వూరి కరణాన్ని కాబట్టి

[illegible] మాటలు [illegible] ఆయన [illegible]
వారు పట్టి నేను అర్థం చేసుకో గలిగింది ఏవి టయ్యా అంటే—ఆయనది, ఆయన భార్యది ఒక కులం గాదని, అందువలన కులం వాళ్ళంతా తమని వెలి వేశారని, ఇంతలోనే భార్య కాస్తా అకస్మా త్తుగా మరణించిందని, ఆ బంధువుల మాటపోటి మాటలనుండి, గతించిన భార్య స్మృతులనుండి తప్పు కునేందుకుగాను, ఆ భార్యవలన కలిగిన ఒక్కగా నొక్క కూతురును తీసుకొని ఇన్ని వందల మైళ్ళ దూరం వచ్చేశాడని — ఆయన మాటలు వింటే నాకు జాలి వేసింది ఆయన మాటల్లో తరచు కళ్ళవెంట నీరు తిరుగుతుండేది ఎంత బాధతో ఇక్కడకు వచ్చాడో అనుకునేవాడిని — అవన్నీ మర్చిపోయి మనస్థిమితం పొందాలని ఇక్కడకు వచ్చాడుగాని పాపం! విధి లిఖితం ఎవరు తప్పించగలరు?"

"ఏమైంది ?" ముందుకు వంగి ఆశక్తిగా అడిగాను

"ఈ వూరు వచ్చిన సంవత్సరం లోగానే అనుకుంటాను నాకు బాగా గుర్తుంది ఆరోజు ఆ రోజు కూతురు పుట్టిన రోజు పండుగట వూరి పెద్దలమైన మమ్మల్ని కొందరిని విందుకు

## [illegible]

తెల్వానరోజు అయితే విందు జరిగేకూరడానే ఆ ఇంటి వెలుగు ఆరిపోయింది ఆరోజే ఆది చీకటి కొంపగా మారిపోయింది ఎన్నో వూహ లతో వచ్చిన ఆయనకు ఆ రోజుతో సర్వం చీక టయింది అంతకు క్రితం రోజువున్న వెలుగు తరువాత ఎన్నడూ ఆ గృహంలో నేను చూడ లేదు !"

ఆయన చెప్పుకు పోతూనే ఉన్నారు

"ఆయనేగాదు ఎవరైనా అలాగే అయి ఉండే వారు .జరిగిన దుర్ఘటన చెబుతాను వినండి! ఆరోజు ఆ అమ్మాయి జన్మదినం అన్నానుగదూ? ఉదయాన లేస్తూనే పని మనిషి తలంటిపోసింది క్రొత్త గుడ్డలు కట్టింది ఆయనే స్వయంగా అద్దాల బీరువా తెరిచి బంగారు ఆభరణాలున్న పెట్టె బయటకు తీశారు అవన్నీ శ్రద్ధగా ఒక్కొక్కటే అమ్మాయికి అలంకరించసాగారు నేను చూచాను గూడా ఆ అమ్మాయిని పచ్చటి శరీరంమీద ఆ సొమ్ములు ధగ ధగా మెరిసిపోతు న్నాయి మెడ కనబడకుండా నగలు వేశారు చేతికి కడ్డె వంకీలు నడుముకు వడ్డాణం "

"ఇంతకీ ఏమైందో చెప్పనేలేదు ?" అడి గాను ఆదుర్దాగా ఆలస్యాన్ని భరించలేక




మీరు మాట్లాడే పద్ధతి చూస్తే, మీ అమ్మాయిని నాకు ఇస్తే, నేను సరిగ్గా పోషించగలనా, లేదా, అనే అనుమానం మిమ్మల్ని పీడిస్తున్నట్లనిపిస్తోంది...

తరువాత సాయంత్రానికి అన్ని సొమ్ములు పెట్టు కొని అత్యంత ఉత్సాహంతో ఆడుకుంటున్న ఆ అమ్మాయి మాయమయింది ఎవ్వరికీ కనబడలేదు ఈ రోజుకు ఆ రోజుకు అది విచిత్రంగానే ఉండి పోయింది మొదట్లో — ఆ సొమ్ముల కాశపడి ఎవరో ఆ అమ్మాయిని ఎత్తుకెళ్ళి ఉంటారని అనుకున్నాం—కాని సొమ్ములు పోతేపోయినయి ఏనాటికైనా ఆ అమ్మాయి తిరిగి రావాలిగదా? - ఇంతవరకూలేదు ఆ సొమ్ముల కోసరం ఎత్తుకు వెళ్ళినవాడే చంపి ఆ పిల్లను ఎక్కడో పార వేశాడనుకున్నా—శవంమీద గూడా ఎంత ప్రయ త్నించినా ఆ చోకీ దొరకలేదు తరువాత ఆరు నెలలకే అనుకుంటాను ఆ దిగులుతోనే ఆయనా కన్ను మూశారు అంతే! ఆ భవనం గతి అలా అయింది!" ఒక నిట్టూర్పు విడిచాడు ఆయన.

"ఆయన పేరు?" ఆసక్తిగా అడిగాను.

"రఘునందనంగారు!"

"ఆ అమ్మాయి పేరూ?"

"చంచల!"

"చంచలా?" పిచ్చిగా గొణిగాను!

ఇట్లు,
శేషగిరి

పదుహేను రోజుల తరువాత క్యాంపునుండి తిరిగి ఇంటికి వచ్చిన నాకు రుక్మిణి ఇచ్చిన లావు పాటి కవరులో విషయం అది!

నేను ఆశ్చర్యపోయాను

ఒక విధంగా నవ్వు గూడా వచ్చింది—దయ్యాలు లేవు అని వాదించే శేషగిరికి ఇది నిజంగా పరా భయమే!—కాని జరిగింది దాచి పెట్టకుండా నాకు వెంటనే జాబు వ్రాసినందుకు (వాడు వోడి పోయినా!) వాడిని మెచ్చుకోకుండా ఉండలేను!

కాస్త ఎగతాళి మిళితంచేసి వాడికి వెంటనే ఉత్తరం వ్రాద్దామని ఆ మధ్యాహ్నం అనుకుం టుండగానే 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' లో నా పేరన ఒక కవరు వచ్చింది

అది వ్రాసింది శేషగిరే!

అంత అర్జంటు విషయం ఏమిటా అని ఆశ్చ ర్యపోతూ త్వరత్వరగా చించాను.

"ఆరేయ్! పిచ్చి నన్నాసి! "

మరో ఘోరం గూడా నా కంట పడింది నాన్నా!

అబ్బాయి! ముందు గుర్తుంచుకో ఇది క్రితంసారి నీకు వ్రాసిన జాబుకు తరువాయి భాగం అని!

ఊరి మొదట్లో కరణంగారు నా కోసరం నిర్ణయించిన గృహం అన్ని విధాలా అనుకూలంగా ఉండటంతో మా జనరల్ మేనేజర్ కోరినట్లుగా 'టెలిగ్రాం' ఇచ్చాను దానికి సమాధానంగా మూడు రోజులకు ఆఫీసు పర్చేజర్‌తో సహా జూనియర్ ఇంజనీర్లు మొదలయిన వాళ్ళంతా ఇక్కడకు వచ్చే శారు.

నాకు తెలిసిన ఒక విచిత్ర మేమిటంటే—నన్ను ఇంతగా కలచి వేసిన ఆ దయ్యాల కొంప కూడా ఈ కంపెనీ సేకరించిన స్థలంలో ఒక భాగమని! కంపెనీ ప్లాను ప్రకారం ఆ ఇంటిని పూర్తిగా పడ కొట్టించాలి ఎందుకంటే సరిగ్గా అది అన్నిటికీ అడ్డంగా మా ఫ్యాక్టరీ మధ్యలో కొచ్చింది దానివలన తప్పలేదు!

నాకు ఎందుకో ఆ మేడను పడగొట్టాలంటే మనస్సు బాధ జెందింది మాటి మాటికి రఘు నందనంగారు, చంచల గుర్తుకు రాసాగారు. వారి చివరి ఆశలకు చిహ్నమైన (వారు ఫలితం పొందక పోవచ్చు!) దానిని తుద ముట్టించాలంటే నాకు కాస్త కష్టంగానే ఉన్నది......కానీ ఏం చేయగలను?...... అధికారుల నిర్ణయాన్ని తు. చ. తప్పకుండా నా భావాలెలా ఉన్నా, నిర్ణయించటమే నా విధి!

అందునా—నేల చదును చేయించే ముందుగానే ఆ మేడను పడగొట్టాలని నిర్ణయించారు!

గుబురుగా, భయంకరంగా ఎన్నో సంవత్సరాల బట్టి ఆ మేడను అంటి పెట్టుకొని ఉన్న చెట్లను, పెచ్చులురాలుతూ పడిపోయేందుకు సిద్ధంగావున్న గోడలను ముక్కలు చేసేందుకు గాను వందమంది కూలీలకు నాలుగు రోజులు పట్టింది

రాళ్ళు సున్నం తీసుకు వెళ్ళి దూరంగా ఉన్న గుంటల్లో పోశారు కొట్టిన చెట్లను వేలం వెయ్యగా వంద రూపాయల దాకా కంపెనీకి ఆదాయం వచ్చింది

ఇక నేలమీద ఒక అడుగు ఎత్తునవున్న ఆ ఇంటి పౌండేషన్‌ను తీయించారు

నిన్న ఉదయం దానిని గూడా చదును చేయిద్దామనే స్థిర సంకల్పంతో అక్కడ తిరుగుతుంటే—అకస్మాత్తుగా నా దృష్టి ఒక చెక్క పలకమీద పడింది అక్కడ నేలలో ఒక గది ఉన్నట్లనిపించింది

కూలీలను పిలిపించి ఆ బిగుసుకుపోయిన తలుపును బలవంతాన లాగించాను పై భాగమంతా గూడా చిన్నగా, జాగ్రత్తగా, లోపలకు బాగా వెలుగు పడేంతవరకు పగల గొట్టించాను

లోపలికి చూస్తూనే నేను కొయ్యబారిపోయాను!

నా ఆశ్చర్యానికి అవధులు లేవు

నా కళ్ళను నేను నమ్మలేకపోయాను

లోపల ఒక ఎముకల గూడు మనిషి ఆకారంలో పేర్చబడి ఉన్నది!

దాని మెడనిండా బంగారు సొమ్ములు చేతి భాగంలో కట్టి వంకీలు ధళ ధళా మెరిసే గుడ్డలవిగాద (అక్కడక్కడా చిరిగిన) నడుముండవల్సిన స్థలంలో బంగారు వడ్డాణం.

ఇక నేను వ్రాయలేనురా కన్నా!

ఇట్లు
శేషగిరి ★

# మగవారి యిష్టాలు : మగువల కష్టాలు

## రత్నా మహీధర్

"రామనాథంగారి భార్యకు జ్వరంగా ఉందిట ఓసారి మధ్యాహ్నం వెళ్ళి చూసొస్తానండీ" అమ్మ నాన్నగారి నడుగుతోంది, మధ్యాహ్నం ఓగంట పర్మిషన్ యివ్వమని

"అబ్బే ఆవిడకేం లెదు కులాసాగా ఉండి వంటా అదీ చేసుకొంటోందిట నిన్ననే రామనాథం గారొచ్చి చెప్పారు," దాటించటానికి చూస్తున్నారు నాన్నగారు

"నా కివాళ నాలుగ్గంట్లకి పనుంది రేపు ఇన్‌కమ్‌టాక్సు కేసుంది అంచేత ఎల్లుండి వెళ్ళు" ధారాళమైన పర్మిషను యిచ్చేసినట్టు ఫోజు పెట్టారు నాన్న

"ఎల్లుండో ఎప్పుడో వెళతాలెండి కారుంది ఆవిడకేం హాయిగా తిరుగుతుంది అనుకుంటారంతా మన సంగతి ఎవరికి తెలుస్తుంది సవాలక్ష అడ్డు అందుకే ఎక్కడికీ వెళ్ళాలనుండదు నాకు" అమ్మ మనసులో మాటలనేస్తోంది మెల్లిగా గట్టిగా అంటే నాన్నగా రేమంటారో భయం ఉండనే ఉంది

ఇలా ఉంటాయి మన ఆడవాళ్ళ అవస్థలు కాలు కదిపి బయటికి అడుగుపెట్టడానికి భర్త అనుమతి ఉండితీరాలి ముఖ్యంగా మన తల్లుల తరం వారికీ బెడద మరీను మనతరం వారికీ ఉంది

కాలేజీకి వెళుతున్నప్పుడు వెళుతున్నానని చెప్పి వెళ్ళాలి సరిగ్గా టైమ్‌కి ఇంటికి రావాలి ఒకవేళ ఏ స్నేహితురాలేనా కనపడి ఆలస్యమవుతే ఎక్స్‌ప్లనేషన్ యిచ్చుకోవాలి కాలేజి నుంచి వచ్చాక స్నేహితురాళ్ల యిళ్లకు వెళ్ళరాదు వెళ్ళినా తండ్రికి అప్లికేషన్ పెట్టుకొని సాంక్షనవుతే వెళ్ళాలి, లేకపోతే లేదు

అదే మగపిల్లలవుతే వేళ పట్టున యింటికి రాకపోయినా ఫరవాలేదు చెప్పకుండా వెళ్లడానికి సర్వ హక్కులూ ఉన్నవి ఈ పై నిబంధనలన్నీ ముఖ్యంగా మన ఆంధ్రుల్లోనే ఎక్కువ • ఎంత పట్నవాసంతో ఉంటున్నా ఎంత సంస్కారులమని డంబాలు కొట్టినా అసలు ఆడవాళ్ల విషయంలో మాత్రం ఆంధ్రులు మరో కొన్ని జన్మాంతరాల వరకూ మారరు, మారలేరేమో ననిపిస్తుంది

పై విషయమే తీసుకోండి నాన్నగారి కెందరో స్నేహితులున్నారు వాళ్ళిళ్ళ కాయన వెళ్ళక పోయినా పనులమీద వారొస్తూనే ఉంటారు ఇక ఆఫీసు పనిమీద ఆయన తిరగని రోజుండదు

మరి అమ్మ. మూడువందల అరవైరోజులూ వంటా, తిండీ కొండొకప్పుడు కుట్టూ తప్ప మరో వ్యాపకమే లేదు.

ఆమెకు కూడా కొన్ని స్నేహితులు కావాలని, మనిషై పుట్టేక వ్యక్తిగతంగా కొన్ని కోరికలుంటాయని కొన్ని విషయాలు తన కిష్టమొచ్చినట్టూ జరగాలనుకుంటుందనీ, సంఘంలో వ్యక్తిగా తనకీ స్థానం ఉండాలనీ అప్పుడప్పుడేనా అనిపిస్తుందనీ నాన్నగారికి తట్టదు నాన్నగారికే కాదు పురుష ప్రపంచానికే తట్టదు

ఒక తరం వెనకగా ఉన్న స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవటం కూడా ఒక విధంగా వారి ఆశయాలు అడుగంటడానికి కారణమని నా ఉద్దేశ్యం

"పండగ వస్తోంది పిల్లలకి బట్టలూ, నాకు చీర కొనుక్కోవాలి" అంటే,

"అలాగే ఆఫీసునుంచొస్తూ కొని తెస్తాలే" అంటాడు భర్త

తన దుస్తులు, డ్రస్సుల విషయంలో ఒక విధమైన అభిరుచి ఉన్నట్టే తన భార్యా పిల్లలకు కూడా ఉంటుందని ఏ భర్తా, ఏ తండ్రీ అనుకోరు!

"ఎంతసేపూ తన యిష్టం, తన అభిరుచీ, తన అవకాశం" యివే పురుషుల మనసుల్లో మెదలుతాయేమో మరి ఇలాటి పరిస్థితులలో పిల్లల మనస్తత్వం అణగారిపోయి వారంతట వారు ఏదీ నిశ్చయించుకోలేని వారిగా తయారవుతారు గృహిణిలో ఎప్పుడూ విస్పృహ, నిరాశ తాండవిస్తుంది దీని కంతటికీ కారణం తమ యిష్టాన్నే, స్త్రీలు తమ దిగా భావించుకోవాలని, పురుషులనుకోటమే

మరి దీనికి భిన్నంగా కొంచెం తెగింపూ, చొరవా ఉన్న స్త్రీలు జట్టీ పెట్టుకొని ఏడ్చి కాని తమ యిష్టం నెగ్గించుకొంటే వారికి గయ్యాళనీ, మొగుడుని ఖాతరే చెయ్యదనీ, మళ్లా మన స్త్రీలే అనేస్తారు

భార్యాభర్తలైనా, అన్నా చెల్లెళ్లయినా, తండ్రీ కూతుళ్లయినా ఒకరి మనసు ఒకరు తెలుసుకోటంలోనే ఉంది కిటుకంతా స్త్రీలకూ్కడా మనసుంటుందనీ, వారికి కొన్ని వ్యక్తిగతమైన కోరికలుంటాయని పురుషులు గమనించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది ఒక మనిషి ఉన్నతుడుగా కావటానికి వివేచనా, విచక్షణా ఉండటానికి అవకాశాలూ, పరిస్థితులూ ఎంతో దోహదం చేస్తాయి. ఈ పరిస్థితుల ప్రభావం వల్లనే తెలివితేటలూ, ప్రపంచ జ్ఞానమూ అభివృద్ధి పొందుతాయి




"ఫలానావారి అమ్మాయి ఎంత బాగా పాడుతుందో చూశావా ? ఎందుకూ, నీకూ నేర్పించాం సంగీతం" అంటూంటారు కొందరు తండ్రులు. ఆపిల్ల అలా పాడి పేరు సంపాదించిందంటే ఆ అమ్మాయి సంగీత సభలో పాడ్డానికి ముఖ్యంగా ఆ తండ్రి అనుమతించాలి ఆ అవకాశం కోసం ఆ అమ్మాయి చేసే ప్రయత్నాలు ప్రోత్సహించాలి లేదా ఆ అవకాశం కలిగేటట్టు చూడాలి అంతేకానీ వెనకటికి మా స్నేహితురాలో అమ్మాయిని వాళ్ళ అన్నదమ్ములు పాడనిచ్చేవారు కారు "మే మింట్లో నించి వెళ్లిపోయాక నీ సంగీతం ప్రాక్టీసు చేసుకో" అంటూండేవారు ఎంత వాళ్ళన్నలు మంచి వాళ్లు కారని తెలిసినా, ఎంత తను బాగానే పాడుతుందని తెలిసినా యింట్లో ఆవిధమైన నిరుత్సాహం ఆ పిల్లపై బలంగా పనిచేయదా ?

లలితకళలకే కాదు, చివరకు పసిపిల్లవాడు పాలు తాగటానిక్కూడా ప్రోత్సాహం అత్యవసరం అలాగని ఇంద్రుడు, దేవేంద్రుడు అని పొగడమని కాదు నా అభిప్రాయం కానీ, ఒక చిన్న ప్రోత్సాహవంతమయిన మాట, ఇంకొక చిన్ని ఉత్సాహవంతమైన అవకాశం మనిషి అభివృద్ధికి ఎంతో తోడ్పడతాయి

"నాన్నగారూ యివాళ మా కాలేజీలో సంగీతం పోటీలండీ నేనూ పాడనా" అన్న కూతురిని ఎంత బాగా, కుమార్తె పోటీచేసి గెలవలేదని తెలిసినా "నీ మొహం, నువ్వు గెలుస్తా ననుకుంటున్నావా? అయినా నీకు సంగీతం చెప్పించింది స్టేజెక్కటానిక్కాదు చక్కగా దేముడి ముందు పాడుకో" అంటున్న తండ్రి కల యింట్లో ఆ పిల్లల విద్య బూడిదలో పోసిన పన్నీరే. అదే,

'చూడమ్మా, చాలా పెద్దవాళ్లొచ్చి పాడతారు ఏమో చూసుకుని పేరియ్యి" అంటే ఆపిల్లక విచక్షణా జ్ఞానాన్ని కూడ కలిగించినవాళ్లవుతారు

మరో రకం పురుష పుంగవులు ప్రతి విషయానికి 'నీ యిష్టం' అంటూంటారు ఇది మరీ చిక్కు చేసే పని మంచిదయి, జయప్రదమయి వాళ్ళ కిష్టమవుతే—చూసేవా, అందుకే ! ఇష్టాని కొదిలేశాను" అంటారు అదే వాళ్ళ కిష్టంలేకపోతే పట్టుకొని దులిపేస్తారు అందుకే అంటూంటారు "పెద్దరికాన్ని నిలుపుకోటం కూడా ఓ ఆర్టే నని"

నిజమే అయ్యో, మగవాళ్ళే పెద్దవాళ్ళే అని మర్యాద నిలిపి స్త్రీ లడిగితే అదేదో సర్వాధికారంగా భావించి పాడుచేసుకొని సంసారంలో సుఖసంతోషాలు లేకుండా చేసే పురుషులు ఎంతమందున్నారు మనలో అందుకే మగవారి యిష్టాలు మగువలకు కష్టాలుగా తయారుకాకూడదు మగువల కష్టాల కనుగుణ్యంగా ఉన్ననాడే ఆ సంసారం స్వర్గతుల్య మవుతుంది. ★

మానసంరక్షణకోసం-3

# నర్తకి చేసిన నేరం

## నార్మన్ రాథామ్

పెంబర్టన్ బిల్లింగ్ మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో మిడ్— హెర్ట్స్‌కి పార్లమెంట్ సభ్యుడుగా ఉండేవాడు అతను ఎంతటి దేశభక్తుడంటే పెద్దపెద్ద పదవుల్లో ఉన్నవాళ్ళు స్త్రీ వ్యామోహానికి దాసులై వక్రమార్గాల నవలంబిస్తే యుద్ధంలో బ్రిటన్‌నే పోగొట్టుకుంటామనేవాడు.

జనవరి, 1918 లో అతని పత్రిక 'ది ఇంపీరియలిస్ట్' సంచలనాన్ని కల్గించే శీర్షిక నొకదాన్ని ప్రచురించింది అదేమంటే 'మొదటి 47,000 జర్మన్ ప్రిన్స్ 'బ్లాక్‌బుక్' లోని వక్రమార్గావలంబికుల పేర్ల సంఖ్య వాళ్ళలోని ఆ బలహీనత నాధారంగా తీసుకొని జర్మన్ ఏజంట్లు వారిని బ్లాక్ మెయిల్ చేశారట

అంత ఖచ్చితంగా 47,000 అని ఎలా చెప్పగలిగాడతడు? పెంబర్టన్ బిల్లింగ్ తన టెలిఫోన్ నెంబర్‌కు మూడుసున్నాలు మాత్రమే చేర్చాడు అతని టెలిఫోన్ నెంబర్ 47

కాబినెట్‌లోనూ, రాయల్ హౌసోల్డ్‌లోనూ, ప్రివీ కౌన్సిల్‌లోనూ చాలామంది ఇలాంటి వక్రమార్గావలంబికులున్నారని వూహించాడు పెంబర్టన్ బిల్లింగ్ ఎప్పుడైతే జె టి గ్రెయిన్ ఇండిపెండెంట్ సొసైటీ ఓస్కార్ వైల్డ్ ప్రదర్శన 'సెలూమ్' ప్రదర్శనాలేర్పాటు చేసిందని తెలిసిందో అప్పుడు తన వూహ సరైందేనని అతి ముఖ్యమైన విషయాన్ని తాను తెల్సుకున్నాననీ అనుకున్నాడు పెంబర్టన్ బిల్లింగ్ కాని తర్వాత ఆ ప్రదర్శనని లార్డ్ ఛాంబర్లెయిన్ ప్రదర్శనార్హం కాదని బహిష్కరించాడు

ఆ ప్రదర్శనలో ఒక అపూర్వమైన నృత్యాన్ని చేయటానికి ప్రపంచ ఖ్యాతిగాంచిన నర్తకి మిస్ మాడ్ ఆలన్‌ని నియమించటం జరిగింది దానికి ప్రకటన కూడా పెంబర్టన్ బిల్లింగ్ ద్వారానే జరిగింది

మాడ్ ఆలన్ నృత్య ప్రదర్శనలో సభ్యత్వం కావాలనేవారు మిస్ వాలెట్టా, 9, డ్యూక్ స్ట్రీట్, ఎడెల్ఫి, డబ్ల్యు సి చిరునామాకి వ్రాయవచ్చు కానీ ఒక విషయం గమనార్హం స్కాట్‌లెండ్ యార్డ్ నేర పరిశోధకులు దాడి జరిపితే మాత్రం ఈ మొదటి 47,000 పేర్లలో కొన్ని వేలు దొరకటం మాత్రం నిజం' అని పేర్కొన్నాడు పెంబర్టన్ బిల్లింగ్

ఇంకా ఇలా వ్రాశాడు—

'ఈ 47,000 మందీ ఎంతగా దుర్వ్యసనాలకు లోనయారంటే— దేశానికి సంబంధించిన రహస్యాలను శత్రువులకు వెల్లడించే స్థితికి వచ్చారు ఇది కాబినెట్‌లోకి, ఇంగ్లండ్‌లోని సమాజ జీవితంలోకి వ్యాపించింది'

దీనివలన మిస్ ఆలన్ వక్ర మార్గాలను లాలిస్తూ రాజద్రోహాన్ని పాలిస్తూందని నిరూపించబడింది

పెంబర్టన్ బిల్లింగ్‌పై ఈ నిందారోపణకి చర్య తీసుకోదలచారు గ్రెయిన్, ఆలన్‌లు.

ఇంగ్లండ్ న్యాయశాస్త్ర చరిత్రలో జరిగిన గమ్మత్తయిన ఎన్నో కేసులలో ఒకదాన్ని అతి చాకచక్యంగా తనకు తనే వాదించుకొన్న పెంబర్టన్ బిల్లింగ్ మిస్ ఆలన్ విషయంలో మాత్రం అంత చురుకుదనం చూపలేకపోయాడు

"మీ ప్రదర్శ నొకసారి మ్యూనిచ్‌లో నిషేధింపబడిందికదూ?" కోర్టులో మిస్ ఆలన్‌ని ప్రశ్నించాడు పెంబర్టన్ బిల్లింగ్

"అవును" మిస్ ఆలన్ జవాబు చెప్పింది.

"ప్రజల్లో అవినీతి ప్రబలకుండా ఉండటం కొరకే అలా జరిగి ఉంటుందనుకుంటాను?"

"ముసలివాళ్ల క్లబ్బునుంచి వెళ్లిన విజ్ఞాపన పత్రమే దానిక్కారణమై ఉంటుంది"

"మాంచెస్టర్‌లో కూడా మీ ప్రదర్శనలకి అడ్డంకు లేర్పడ్డాయనుకుంటాను?"

"అవును"

"వాచ్ కమిటీ వల్లేగదూ" నవ్వాడు పెంబర్టన్ బిల్లింగ్.

"అవును! ఆదే మా ప్రదర్శనకంతరాయాన్ని కలిగించింది"

"మీ ప్రదర్శనల్ని వ్యతిరేకించేవారంతా నీతివంతులేనంటే మీ రొప్పుకోరుటారా?" అనడిగాడు పెంబర్టన్ బిల్లింగ్.

"ఒప్పుకుంటాను. కాని అది మీ విషయంలో మాత్రంకాదు!" ఆమె తీవ్రంగా సమాధానం చెప్పింది.

కానీ పెంబర్టన్ బిల్లింగ్ ఆమె నంతటితో వదల్లేదు. "నాట్యంలో అసభ్యకరమైన దృశ్యాల్లేవా?" అని ప్రశ్నించాడు.

"పోల్చిచూస్తే అలా కన్పించవచ్చు. నేను కళాస్రష్టను ఎవరైతే నా నాట్యం అసభ్యకరమైన హావభావాల్తో నిండిఉందని ఒకప్పుడు విమర్శించారో వాళ్ళే ఇప్పుడు మెచ్చుకుంటున్నారు" ఆమె చాకచక్యంగా సమాధానమిచ్చింది.

సమాజంలోని చీడపురుగుల్ని బయటకీడ్చటానికి పెంబర్టన్ బిల్లింగ్ సాధ్యమైనన్ని సాక్ష్యాలను సేకరించాడు దీంట్లోపడి అతను ఆలన్‌ని మర్చిపోయి సమాజంలోని చీడపురుగులపై దాడి ప్రారంభించాడు

"బ్లాక్‌బుక్‌ని అందులోని పేర్లను తాను చూశా"నని శ్రీమతి ఎయిలీన్ విల్లియర్స్ స్టువర్ట్ తన సాక్ష్యమివ్వగానే కోర్టుహాలంతా జనంతో కిటకిటలాడి పోయింది

"ఆస్క్విత్ పేరు అందులో ఉన్నదా?" పెంబర్టన్ బిల్లింగ్ ఆమె నడిగాడు

"ఆఁ ఉన్నది" ఆమె అందరికీ వినిపించేలా పెద్దగా అరిచింది.

48 వ పేజీ చూడండి



# అపస్వరం

మూలం త్రివేణి
అనువాదం శర్వాణి

### జరిగిన కథ

పసితనంలోనే కన్నవారికి దూరమైన మీర, పెదనాన్న కృష్ణయ్యగారింట్లో పెరిగి పెద్ద దవుతుంది గోపీ అన్నయ్యలాగా తను కూడా డాక్టర్ చదవాలని కలలు కంటుంది కానీ ఆ కలలు ఫలించకుండా శాముతో మీర వివాహం జరిగిపోతుంది మనస్సులోని డాక్టరవాలన్న కోర్కె తను యింటర్ ఫస్ట్ క్లాసులో పాసయిందని తెలియగానే బలవత్తరమౌతుంది ఆ కోర్కెను భర్తతో చెప్పినా ఫలితం లేనందున గతాన్ని కొంత మరవచ్చు ననే వ్యూహతో పల్లె స్త్రీలకు విద్యాబోధన చేయాలని సంకల్పిస్తుంది కానీ, అదీ నెలరోజులైనా సరిగా నడవక మూలపడుతుంది మీరను చూడ్డానికొచ్చిన స్నేహితురాళ్ళు పల్లె వాతావరణానికి మురిసిపోతారు. శాము ప్రవర్తన వలన మీరకు అతనిమీద విపరీతమైన ద్వేషభావం కలుగుతుంది కాని అతనిలో కొంత మంచితనాన్ని కూడా చూస్తుంది మీర పిల్లలంటే తనకున్న అయిష్టాన్ని తెలియబరుస్తుంది కాని పాప పుట్టిన తర్వాత తనకు తెలియకుండానే మాతృసహజమైన వాత్సల్యం ఏర్పడుతుంది మీరలో

## 14

ఉదయం ఆరింటికే ఇల్లు కలకలలాడ సాగింది కమలమ్మగారు ఉదయమే తల్లీ పిల్లలకు తలంటి పోసి, మడి కట్టుకున్నారు మీర బాదామిరంగు చీర కట్టుకుని, వదులుగా ముడివేసుకుని పూలు పెట్టుకుంది. పసుపు రాసిన చెంపలు మెరిసిపోతున్నాయ్ తన కళ్ళకు కాటుక పెట్టుకొని చెయ్యి బాగా తుడుచుకుంది. వేలితో కాటుక తీసుకొని పడకమీద చేతులూ కాళ్ళూ ఆడిస్తూ పడుకున్న పాపవేపు చూసింది. దగ్గరగా వెళ్ళి బలవంతంగా కళ్ళు తెరిపించి, రెండు కళ్ళకూ కాటుక పెట్టింది. బిడ్డ ఏడ్వమంది. చేతులు, కాళ్ళూ విదిలిస్తూ, గుక్కపట్టి ఏడ్వసాగింది. మీర కంగారుపడింది. ఏంచేయాలో తోచలేదు. శాము దగ్గరికి పరుగెత్తి,

"బిడ్డ గుక్కపట్టి ఏడుస్తోందండీ. ఏం చేయనూ" అని చేతులు పిసుక్కుంది.

"ఆకలేమో చూడు"

"లేదండీ, ఇప్పుడే పాలుపట్టి పడుకోబెట్టాను."

"మీ పెద్దమ్మతో చెప్పు. ఎంతయినా అను భవంకలవారు. వారికీ తెలియకపోతే డాక్టరును తీసుకొస్తాను"

బిడ్డ ఏడుపు విని వంటింటినుండి బయటికి వచ్చారు, కమలమ్మగారు.

బిడ్డ కళ్ళు తెరవకొని పడుకుంది కళ్ళు ఎర్రగా ఉన్నాయి కళ్ళనుండి నీరు కారుతూంది

"ఎంతకంగారు పెట్టావు మీరా మనం పెట్టుకున్నట్టు మొరటుగా కాటుక పెట్టరాదు పిల్లలకు నొప్పయిందేమో పాపం ఏడవకేం చేస్తుంది?" అన్నారు

పిల్లల్ని ఎలా చూసుకోవాలన్న విషయంమీద ఒకగంట లెక్చర్ ఇచ్చాడు, శాము మీరకు ఏ విషయంలోనైనా మాటపడక ఎదురుతిరిగే మీర, నోరు మెదపక బుద్ధిగా భర్త చెప్పినదంతావింది పెద్ద నేరం చేసిన దానిలా బాధపడుతూ "ఇంకెప్పుడూ అలా చెయ్యనండి" అని భరోసా ఇచ్చింది, శాముకు.

శాము, మీర పీటలమీద కూర్చునేసరికి, కావేరమ్మగారు నర్మద, కిశోర్ లోపలి కొచ్చారు నర్మద మీర దగ్గర కూర్చుని, మీర తొడమీదున్న పాపబుగ్గ గిల్లి "అందంలో నిన్ను మీరు తుంది" అని తనే అల్లిన స్వెటర్ ఇచ్చింది పురోహితులవారు మంత్రాలన్ని చెప్పముగించి,

"బిడ్డకు పేరేంపెడతారు" అనడిగారు.

"జానకి"

"సరె బిడ్డ చెవిలో ఆపేరు చెప్పెయ్యండి"

శాము మీర తొడమీద కళ్ళుమూసుకొని ప్రశాంతంగా పడుకున్న బిడ్డచెవిలో 'జానకి' అని చెప్పాడు వంచిన తన తల మీదుగా రెండు కోపారుణ నేత్రాలు తనమీద అగ్నివర్షం కురిపిస్తున్నాయని తెలుసుకుని, ఎడమ కను బొమను కొద్దిగా పైకెత్తి, జయం తనదే అన్నట్టుగా మీరవేపుచూసి, వ్యంగ్యంగా నవ్వాడు

కమలమ్మగారు, కరుణా, హారతివ్వగానే, కోపంతో తొడమీద బిడ్డవున్న సంగతికూడా మరచి, పైకి లేవబోయింది శాము "జాగ్రత్త పాప" అని హెచ్చరించాడు మీర బిడ్డ నెత్తుకుని లోపలికి వెళ్ళిపోయింది

రాజా, చంపా, నర్మదా, ముగ్గురూ మీర వెంబడే గదిలోకి వెళ్ళారు

"కంగ్రాట్స్, మీరా తల్లివై పోయావ్. మమ్మల్ని మరచిపోకేం" చంపఅంది

మీర నోటి మీద వేలుంచుకుని "ష్ పాప నిద్రపోతుంది గట్టిగా మాట్లాడకండి బయటికి వెడదాం పదండి"

హాల్లో చాప వేసుకుని కూర్చున్నా రందరూ

"మీరా, ఓ శుభవార్త చంప ఇక మా క్లబ్బు వదిలేసి మీ క్లబ్బులో చేరుతోంది" అంది నర్మద

"ఓ. కంగ్రాట్స్, చంపా ! ఎప్పుడే మా క్లబ్బుకు రావటం నువ్వు ?"

చంప సిగ్గుపడుతూ "ఇంకా సరిగ్గా తెలియదె" అంది

రాజా, కసి తీర్చుకున్నట్టుగా "మీరా చంప—ఉడ్—బిని చూడాలి, నువ్వు ఇంతవరకు నన్ను ఏడిపించినట్టు కాదు ఆ మహానుభావుడు నడుస్తోంటే, ఓ చిన్న కొండ నడుస్తున్నట్టే ఉంటుంది నన్ను బెలూన్‌లా ఉన్నానని ఏడిపించేది కదూ ? ఆయనగారో గాలి నింపిన గోనె సంచి" అంది.

చంప మొహం ఎర్రబడింది.

"రాజా . వూరుకోవె"

"ఊహూం నువ్వెన్ని చెప్పినా విననుఇన్ని రోజుల అప్పు వడ్డీతో సహా తీర్చుకుంటాను ఇప్పుడు ఛాన్సు నాది" అంది.

మీర చిరునవ్వు నవ్వి "నిజమటె ? చంపా లావుపాటి మనుష్యులంటే హాస్యాస్పద వ్యక్తులు అనేదానివిగా" అంది

"పాపం ! ఇపుడేం చేస్తోందో తెలుసా ? ఆ వారం బెంగుళూరి నుండి ఆయనగారు రాకపోయా రంటే, చూడాలి మన చంప మొహం ! ఓ తపస్సు చేయడానికి ప్రారంభిస్తుంది"

"ఒహో, అదీ సంగతి. నాకేమి తెలియ తెలియదుసుమా"

"అతను వీరి బంధువర్గంలోని వాడే" నర్మద అంది

"అన్తమానం 'నిన్ను చూడలేనే రాజా క్లాసులోపలా, బయటా, నీ కాయాన్ని చూసి మా కళ్ళు ఎంత అలసిపోతున్నాయో ఒక్కోభాగమే విడివిడిగా చూడాలి' అనే దానివిగ ఇప్పుడో ?" వెక్కిరించింది రాజా

బయట ఆడుకొంటున్న కిశోర్ పరుగెత్తుకుంటూ వచ్చి నర్మద మెడ చుట్టూ చేతు వేసి "పిన్నీ .. పిన్నీ . ." అన్నాడు ముద్దుగా.

"వదలమ్మా మంచివాడివి కదూ" అంట విడిపించుకుని నర్మద, "నీకో బుల్లి పెళ్ళాం కావాలా" అంది

"ఊహూం నాకొద్దు" అంటూ బయటికి పారిపోయాడు కిశోర్.

మళ్ళీ స్నేహితురాళ్ళు బాతాఖానీలో పడ్డారు మీర హఠాత్తుగా "కాస్త ఉండండర్రా, పాప ఏడుస్తున్నట్టుంది" అంది. అందరూ మాటలాపి మీర వేపు ఆశ్చర్యంగా చూశారు స్నేహితులతో మైమర కబుర్లు చెప్పుకుంటున్నా, మీర మనసుకు పాపం పిలుపు వినబడింది

సాయంత్రం పాపాయికి నీలం ఫ్రాకు తొడిగింది గొలుసు వేసింది గాజులూ, పాంజేబులు తొడిగింది నుదుటిమీద కాటుకతో తిలకందిద్ది తనూ ముస్తాబవసాగింది ఆకుపచ్చ మైసూర్ క్రేప్ కట్టుకుని, పసుపురంగు చోళి తొడుక్కుని, శాము కొత్తగా చేయించి తెచ్చిన ముత్యాలూ, కెంపులూ పొదిగిన గాజులు వేసుకుంది

బిడ్డను చూద్దామని లోపలికి వచ్చిన శామ పెళ్ళాన్నీ, బిడ్డనూ చూసి స్తబ్ధుడై నిలబడి పోయాడు

మీర "ఏం అలా నిలుచుండిపోయారు ?" అంది

"ఇద్దరిలో ఎవరిని ఎక్కువసేపు చూడాలా అని ఆలోచిస్తున్నా."

"వీణ నాకన్నా ముద్దుగా ఉంది. దాన్నే చూడండి."

"వీణ కాదు—జాని .... జాని" శాము వత్తి పలికాడు.

"జాని కానేకాదు—వీణ"

"సరే నీ కెలా ఇష్టమో అలాగే పిలు. నా కిష్టమైనట్టు నేను పిలుచుకుంటాను."

"వీణ పెద్దయ్యాక 'జాని' బాగాలేదు నాకు 'వీణా' అన్న పేరే ఉండనీ అంటేనో"

"అప్పుడు తన కిష్టమైనట్టే పిలుస్తాను. జానీ . జానీ "

"వీణా . "

పాపాయి పెద్దగా కళ్ళు తెరచి నవ్వింది. మీర వెక్కిరిస్తూ "చూశారా దానికి 'వీణా' అన్న పేరే ఇష్టమట !" అంది

"ఇప్పటినుండి ఎందుకూ వాదించుకోవటం" అంటూ శాము వంగి పాపాయి బుగ్గలు ముద్దు పెట్టుకున్నాడు.

మీర అతని భుజం పట్టి లాగి "బిడ్డ నెందుకు ముద్దుపెట్టుకున్నారు ?" అంది.

"ఏం. నీ కసూయా ? సరే, మొదట నీకే. "

మీర మొహం అటు తిప్పుకొని, "ఛా ! పొండి. మీరు షేవ్ చేసుకోకుండా బిడ్డను ముద్దెట్టు కోకండి. బుగ్గ మంటపెడుతుంది"

"నొప్పెయిందామ్మా" అంటూ పాప బుగ్గ నిమిరాడు శాము

శాము ఇక పల్లెకు వెళ్ళాలి. జీవితంలో తొలి సారిగా పల్లెకు వెళ్ళాలంటే విసుగుపుట్టిం దతనికి. మీరను వదలి పల్లెలో ఉంటున్నప్పుడు కూడా మైసూరికి వచ్చినప్పుడు రెండు రోజులకన్నా ఎక్కువగా ఉండలేక పొయ్యేవాడు ఇంకా ప్రపంచంలోకి అడుగుపెట్టి నెలదోజులన్నా గడవని ఆ పసికందు శాము హృదయాన్ని ఆకట్టుకుంది. వూరికి వెళ్ళే ముందు షేవ్ చేసుకుని, బిడ్డను ముద్దు పెట్టుకుని, మీరతో, "బిడ్డను జాగ్రత్తగా చూసుకో" మని పలుమార్లు చెప్పి, అయిష్టతతోనే పల్లెకు బయల్దేరాడు. ప్రతి వారమూ వచ్చి చూసి వెళ్ళే వాడు

బిడ్డకు నాలుగో నెల వెళ్ళగానే భార్యా బిడ్డలను తీసుకువెడతానని కృష్ణయ్యగారితో చెప్పాడు, శాము కృష్ణయ్యగారు వారి ప్రయాణానికి ఓ మంచిరోజు చూసిపెట్టారు రెండు రోజులు ముందుగా శాము మైసూరికి వచ్చాడు.

ప్రయాణానికి ముందు రోజున, మీర వీణని కమలమ్మగారికి అప్పజెప్పి, భర్తతో బజారుకు వెళ్ళింది. కమలమ్మగారికి నెమలికంఠం రంగు పట్టుచీర కొంది. బిడ్డకు కావలసిన వస్తువులెన్నో కొంది అన్నీ అయ్యాక శాము,

"అయిందా రాణిగారి షాపింగ్" అనడిగాడు.

"ఇంకా లేదు. వీణకో బండి కొనాలి."

"బండి ! ఎద్దులబండి కాదుగా !!"

"ఇంకా నయం. ఒక 'ప్రాం' తీసుకుందామని. పల్లెలో పాపాయిని షికారు తీసుక వెళ్ళటానికి వీలుగా ఉంటుంది."

ఇద్దరూ అరగంట పరీక్షించి అందమైన 'ప్రాం' బేరం చేసారు శాము రెండువందలాభై రూపాయలిచ్చి రసీదు తీసుకొని,

"రేపు వచ్చి తీసుకువెడతాం. అందాక ఇక్కడే ఉంచండి" అని చెప్పాడు. లెక్కలేనన్ని ఆట వస్తువులు, రెడీమేడ్ దుస్తులు అన్నీ కొనటం అయింది.

"నీకేమీ వద్దా మీరా ?"

"ఊ హూఁ నాకేమీ అక్కర్లేదు. నా కేమైనా కావాలనిపిస్తే వీణకే కొనిపెట్టండి"

"జానికి ఇప్పుడు కొన్నవి చాలవా ?"

"ఇక్కడి బజారు బజారంతా కొన్నా తృప్తి లేదు నాకు."

"నీ కెక్కడో పిచ్చి"

సామాన్లంత ప్యాక్ చేయించి, ట్రైనులో వేయించి, తామూ ట్రైనులో వస్తానన్నారు కృష్ణయ్యగారు.

విందు భోజనా లయ్యాక శాము టాక్సీ తెచ్చాడు. మీర దేవుడికి పెద్దలకి నమస్కరించింది. వీణ చిన్ని తలను పెదనాన్న కాళ్ళకు తాకించి "మా బిడ్డను ఆశీర్వదించండి పెదనాన్నా" అంది.

కృష్ణయ్యగారు ప్రేమతో "నీకున్న ఈ ఒక్క మొక్కలో వేయి పువ్వులు పూయించాలని ఆశీర్వదించాడు.

కృష్ణయ్యగారిని స్టేషనులోనే వదలి, టాక్సీ పల్లెవేపు బయలుదేరింది.

నాలుగు నెలల పాప వీణ బొద్దుగా ముద్దుగా ఉంది. మీర ఉంగరాల జుత్తు, వీణకు తల్లి నుంచి సంక్రమించిన ఆభరణంలా అమరింది. తలకు వల్లటోపి వేసినట్టుగా, ఎర్రటి మొహాన్ని ఆవరించింది. పెద్ద పెద్ద కళ్ళు తెరచి చూస్తూ, అమాయకంగా నవ్వుకునే వీణ ఎవరినైనా ఇట్టే ఆకర్షించేది శాము తెచ్చిన గాజులు, బిగువవటం వల్ల రెండే నెలలకి కత్తిరించేశారు గులాబిరంగు వళ్ళు, సొట్టలు పడే బుగ్గలు, ఎలాటివారినైనా ఆకర్షించేవి. నాలుగు నెలల పాప బొద్దుగా పెరిగి చూడటానికి సంవత్సరపు పిల్లలా ఉండేది.

మీర టాక్సీలో కూర్చుని, బిడ్డకు శాలువా కప్పింది. వీణ మొహంమీద నుండి శాలువ తొలగించి తల్లిని చూసి నవ్వింది. మీర అక్కరతో,

"నా చేతకాదు బాబూ. మీ అమ్మాయిగారి అల్లరి చూడండి" అంది

శాము చేతులుచాచి, "దామ్మ జాని. నే నెత్తు



కుంటాగా" అని బిడ్డ నెత్తుకొని, మొహం మాత్రం బయటి కుండేట్టుగా వంటినిండా శాలువ కప్పాడు. వీణ హాయిగా పడుకుని, కాస్సేప టిలో నిద్రపోయింది.

మళ్లీ వీణ మేలుకునేసరికి టాక్సీ పల్లెలోకి ప్రవేశిస్తోంది.

వెంకమ్మగారు, ఇల్లంతా బోరడిచేత శుభ్రంగా కడిగించి ముగ్గులుపెట్టి ద్వారబంధాలకు మామి డాకుల తోరణాలు కట్టించారు

శాము రైతులు, వారి ఆడవారు, 'శామప్ప గారి' రాజకుమారి దర్శనార్థం ఇంటిముందు గుమిగూడారు.

ఇంటిముందు టాక్సీ అగగానే పల్లెటూరి పిల్లలు మెరుస్తున్న కారును ఆశ్చర్యంతో చూడ సాగారు శాము కారు దిగి వీణ నెత్తుకున్నాడు వీణ సంతోషంతో అర్థంలేని శబ్దాలను చేస్తూ తండ్రి భుజాన్ని గట్టిగా పట్టుకుంది

గులాబి రంగులో ముద్దులు మూట కట్టే పాపను చూసిన వాళ్ళ ఆనందానికి పారమేలేదు వృద్ధ నంజవ్వ, వీణ బుగ్గలను తన చేతితో తాకి టక్కున మెటికలు విరచింది శాము వీణ నెత్తుకొని లోపలికి వెడుతూ, "మీరా వీరంద రికి ఫలహారాలు పంచి పెట్టు" అన్నాడు

మీర బుట్ట విప్పి రవ్వ లడ్డు, చక్కిలాలను పిల్లలందరికి పంచి పెద్దవారికంతా పంచదార, ఎండు కొబ్బర కలిపిన తీపి పంచి పెట్టింది. అందరూ ఇళ్ళకు బయలుదేరారు

"మాదవ్వా బిడ్డ బంగారు బొమ్మలా ఉంది గాదా"

"బంగారు బొమ్మలా ఉండకేం నంజవ్వా ఆలుమగలు లచిమి నారాయణుల్లా ఉన్నారు. బిడ్డేలా ఉండేను? శామప్పగారి అయ్యగారికి ఆ బాబొక్కడే కొడుకు ఇపుడు ఈయనకో బిడ్డ. గొలల్లో పెట్టి పెంచుకుంటారు మారాజులు"

"ఆరికేం తక్కువా? పాలు నెయ్యి కొదువా? కొడిగిన గుడ్డ సూశావా? ధళా ధళా మెరుస్తుండాది దాని ఎలవో వంద రూపాయలు సేసును కొంటాను"

"బిడ్డ చెవుల్లో లోలక్కు చూశా కమల పువ్వులా ఎంత బాగుండాదో. ఇటూ అటూ తిరిగితే దళక్ పళక్కని మెరుస్తున్నాది"

వీళ్ళ మాటలను మౌనంగా వింటూన్న తిమ్మవ్వ నిట్టూర్చి "కలిగినోళ్ళకే బిడ్డలు పుట్టాలి మన లాంటి బీదోళ్ళకు బిడ్డల్నివ్వ కూడదూ దేముడు?" అంది

శాము బిడ్డ నెత్తుకొని లోపలికి వెళ్ళగానే వెంకమ్మగారు దిష్టి తీసి, కొబ్బరి కాయ దిగ తుడిచి పగుల కొట్టి హార తిచ్చారు. అవధానిగారి కూతురు వెంకు పరిగెత్తుకుంటూవచ్చి, "శామణ్ణా నే నెత్తుకుంటాను ఇవ్వు" అంది

కొత్త మొహాన్ని చూసి వీణ వెంకూ దగ్గ రకు వెళ్ళకపోయినా, బలవంతంగా ఎత్తుకొని, బిడ్డ నోటిమీద ముద్దెట్టుకుంది దీనిని చూసిన మీర తీక్షణంగా, "ఇకమీదట బిడ్డ నోటిమీద ముద్దెట్టుకోకు" అంది వెంకు అనుకోని ఈ దాడితో అప్రతిభురాలై శామువేపు చూసింది శాముకు, వెంకూకు చిన్న బిడ్డ మీదున్న సరళ మైన ప్రేమ అర్థమైనా, పాప శ్రేయస్సు దృష్టితో "అవును వెంకూ, మీర చెప్పేది నిజం అలా నోటి మీద ముద్దెట్టుకోవటం, బిడ్డ ఆరోగ్యం దృష్ట్యా మంచిదికాదు" అన్నాడు

వెంకు నొచ్చుకుంటూ "నాకు తెలియదు శామణ్ణా ఇంకెప్పుడూ అలా చెయ్యను బిడ్డకు పేరేంపెట్టారు?" అంది

"నేను జానకి అని పెట్టాను ముద్దుగా జాని అని పిలుస్తాను."

"ఆ పేరు నాకు నచ్చలేదు వెంకూ నేను వీణా అని పిలుస్తాను"

వెంకు ఆశ్చర్యంతో నోరు తెరచి "ఆ" అంది

"వీణ"

"వీణా? అంటే బొమ్మలోని సరస్వతి చేతి ఉంటుందే అదేనా? నాకేమో జానినే బాగుం బాబూ"

వెంకుతో ఫిర్యాదు చేస్తున్నట్టుగా శావ "వెంకూ నువ్వైనా దానికి బుద్ధి చెప్పమ్మా ఆ పేరు తెచ్చి నా పాపకు పెట్టింది" అన్నాడ

హాలులోని గడియారం నాలుగు గంట కొట్టగానే అదిరి పడింది మీర

"అయ్యో పాడు మతిమరుపు బిడ్డకు పా పట్టే టైమయింది" అంటూ వంట గ వైపు వెళ్ళింది వెంకమ్మగారితో,

"కాస్త ఆవుపాలు వెచ్చ బెట్టండి వీణకు పా పట్టాలి" అంది

వెంకమ్మగారు ఆశ్చర్యంతో,

"అదేమిటమ్మాయ్ పాప కింకా నాలుగునెల్లేగ నువ్వు పాలివ్వవా?" అన్నారు

"నా దగ్గర పాలు చాలటంలేదు వీణకు" అంటూ పాల సీసా కడిగి తేవటానికి బయటక వెళ్ళింది వెంకమ్మగారు పాలు కుంపటిమీద పెట్టి విసురుతూండగా లోపలి కొచ్చిన మీర ఏదో పెద్ద ప్రమాదం జరిగినట్టుగా

"అయ్యయ్యో ఉండండి కాస్త పాలగిన్నె మీద మూత లేకుండా విసిరితే దుమ్ము పడుతుంది" అంటూ గిన్నెమీద మూత వేసింది వెంకమ్మగారు పాలు తెచ్చివ్వగానే మీర పాలు వడియ కట్టి పాల బుడ్డీలో వేసింది వెంకు ఇదంత ఆశ్చర్యంతో చూస్తూ కూర్చుంది వెంకు తమ్ముడ చిన్న పిల్లాడిగా ఉన్నపుడు వాళ్ళమ్మ ఉగ్గు గిన్నెత పాలు పట్టండటం మాత్రమే తెలుసు

మీర "దావమ్మా" అంటూ వీణను తొడమీద పడుకోబెట్టుకొని మొదట అడాక్సలిన్‌వేసి తరు వాత నిప్పలు నోట్లో పెట్టింది వీణ తల్లి వైపు చూస్తూ తృప్తిగా పాలు తాగసాగింది

శాము లోపలికొచ్చి "మీరా రైలొచ్చే వేళ యింది నేవు వెళ్ళి వ మయ్యగారిని తీసుకొస్తాను" అంటూ వీణ బుగ్గ గిల్లటానికి దగ్గర కొచ్చాడు. మీర,

"మీరు వెళ్ళండి ఇక మిమ్మల్ని చూస్తే వీణ పాలు తాగదంతే" అంటూ కసిరింది.

శాము బయటికి వెళ్ళాడు

మీర పాపకు పాలు పట్టి, పాలసీసా కడిగి పాపను చేతికిచ్చి "వెంకూ జాగ్రత్తగా ఎత్తుకోమ్మ. పడేసేవ్ రెండు చేతులతో గట్టిగా పట్టుకో! ఇప్పుడే పాలు పట్టానా మ్మ దు వుగా ఎత్తుకోలేకపోతే కక్కుతుంది" అని చెప్పి వూరినుండి తెచ్చిన సామానులు సర్దడానికి లో లికి వెళ్ళింది వెంకు మీర మాటలు విని తనలో తనే నవ్వుకుంది తన తమ్ముళ్ళా, చెల్లెళ్లను చిన్నప్పటినుండి ఎత్తుకుని బాగా అలవాటు వెంకుకు అయిదేళ్ళ పిల్లగా ఉన్నప్పుడే వాళ్ళమ్మ తనను బిడ్డ నెత్తుకో నిచ్చేవారు. కాని ఎప్పుడూ ఈవిధంగా హెచ్చరించలేదు

పెద్దవారి సాహసం అనుకుంటూ బయటికి వెళ్ళబోయింది

మీర కంఠం వెనుకనుండి వినిపించింది — "వెంకూ పాపకు స్వెటర్ వేయలేదు, బయటికి తీసికెళ్ళకు"



వెంకు చాపమీద కూర్చొని బిడ్డను ఆడించ సాగింది

కృష్ణయ్యగారు, శాము ఇంట్లోకి రాగానే వెంకూ కుతూహలాన్ని ఆపుకోలేక లేచి వచ్చింది. ప్రామ్‌ని చూసి,

"ఇదేలాంటి బండి శామణ్ణా" అనడిగింది

కృష్ణయ్యగారూ శామూ ఇద్దరూ నవ్వారు శాము నవ్వుతూనే,

"ఇది కారు కాదమ్మా, పిల్లలను బయటికి తీసుకెళ్ళాలంటే ఇందులో పడుకోబెట్టి తీసుకెళ్ళొచ్చు" అంటూ వీణ నెత్తి ప్రామ్‌లో పడుకోబెట్టాడు

"ఎండగా ఉంటేకాని, వర్షమొస్తేగాని, టాపు వెయ్యొచ్చు" అని టాపు వేసి చూపించాడు. వెంకు దాన్ని చూసి విస్మేరపోయింది మెరుస్తున్న ముదురు ఎరుపు రంగు, చిన్న చక్రాలు లోపలున్న మెత్తటి కుషన్ పీటనంతా ఆశ్చర్యంతో చూడసాగింది

"తరువాత ఇలా పట్టుకు ముందుకు తోసుకుంటూ ఎక్కడికైనా వెళ్ళొచ్చు" అంటూ కాస్త దూరం బండిని తోసి చూపించాడు శాము అతను వదలగానే వెంకు,

"శామణ్ణా నేనూ కాస్త దూరం తోస్తాను" అంది ఆ బండిని హాల్లోనే అటునుండి ఇటు తోసుకుంటూ ఆనందించింది బోరడు లోపలికి తెచ్చిన ఉయ్యాలను, మీర తమ గదిలో కిటికీకి ఎదురుగా పెట్టించి, దోమ తెర కట్టింది వూరి నుండి తెచ్చిన సామానులు సర్దేసరికి రాత్రయింది ఏడు గంటలకు వీణకు పాలు పట్టి పడుకోబెట్టి తరువాత భర్తకూ, పెదనాన్నకూ భోజనానికి ఆకులు వేసింది

వీణ పుట్టక మునుపు పల్లెలో ఒక్కో నిముషమూ ఒక్కో యుగంగా గడిచేది మీరకు ఇప్పుడిహ తీరికన్న మాటేలేదు! వీణ గుడ్డలు ఉతికించి ఇస్త్రీ చేయటం, వీణని ఆడించటం, పాలు పట్టటం, సాయంత్రాలు అలా తిప్పుక రావటం, వీటితో రోజులు ఎలా గడచి పోతున్నాయో తెలియటంలేదు. వీణ నిద్రపోయేటప్పుడు మాత్రం కాస్త తీరిక దొరికేది అప్పుడు మేజోళ్ళు అల్లుతూనో, నవల చదువుతూనో కాలం గడిపేది కాస్సేపు చదివేసరికి వీణ నిద్ర లేచేది.

తన జీవితంలోని పెద్ద మార్పును మీర గమనించింది పెళ్ళయిన రోజునుండి కూడా శాము మీర భార్యా భర్తలుగా ఒకే ఇంట్లో జీవిస్తున్నా, వారిద్దరి మనసులు ఎప్పుడూ ఒకటవలేదు. మోహావేశంలో, ఉద్వేగపు సమయాల్లో శాము ఎన్నో సార్లు ఆమెతో మృదువుగా, ప్రేమగా మాట్లాడేవాడు కాని వారిద్దరి అభిప్రాయాలు, జీవితపు ఆదర్శాలూ, ఆకాంక్షలూ అన్నీ పూర్తయి భిన్నమైనవే! చీర రంగు విషయాన్నుండి, వారు ఏది తమ జీవితపు ధ్యేయ మనుకునేవారో అక్కడిదాకా అన్ని విషయాల్లోనూ వారి మనసులు విడివడి రెండు భాగాలుగానే ఉండిపోయాయి. కేవలం దైహిక ఆకర్షణవల్ల నిసర్గ నియమానికి లోనైన వేడి రక్తపు మనసులు కొన్ని మార్లు ఒకటిగా ఉండేవేకాని, వారి హృదయాలు మాత్రం ఒకటి కాలేదు తన స్నేహితులు వచ్చిన రోజు రాత్రి శాము తనను బలాత్కారం చేయటంతో, మీరకు దైహిక సంబంధమంటేనే, తీవ్రమైన అసహ్యం, విసుగు, కోపం జనించింది. అప్పటి నుండి, ఆమె సాధ్యమైనంతవరకూ భర్తనుండి దూరంగా ఉండటానికే ప్రయత్నించింది. కాని ఇంద్రియాలకు దాసుడైన శాము ప్రతిసారి, తన కోర్కెను నెరవేర్చుకుంటూ, ఆమె మనసు నుండీ దూర మవసాగాడు. దూర దూర మవుతున్న రెండు హృదయాలనూ, దగ్గరకు చేర్చి, బంధించింది చిన్నారి వీణ తనకు ఇరుపక్కలా వున్న ఇనుప ముక్కలను, అయస్కాంతం ఆకర్షించినట్టు, శాము, మీరా, వీణ దగ్గరికి వచ్చారు. భార్యా భర్తలకు ఎన్ని అభిప్రాయ భేదాలున్నా, తమ బిడ్డ హితం కోరే విషయంలో మాత్రం ఒకటిగానే ఉండేవారు మిగతా విషయాలలో ఎంత విరుద్ధ భావాలున్నా, దానిని మరిపించి, దగ్గరగా వచ్చేలాగా వారిద్దరిని, తనమీది వాత్సల్యపు గొలుసుతో బంధించసాగింది వీణ.

శామూ, మీర ప్రతిరోజూ సాయంత్రం వీణను ప్రామ్‌లో కూర్చోబెట్టుకుని, తోసుకుంటూ షికారు వెళ్ళేవారు ప్రశాంతమైనచోట బండిని ఆపి ఎగిరే పక్షులనూ, తేలుతున్న మబ్బులనూ వీణకు చూపించేవారు ఒక్కోసారి వీణమీద వారికున్న అమితమైన ప్రేమవల్లనే దెబ్బలాడుకునేవారు కూడా.

"మీరా, జానీకి పన్నెండో ఏటనే పెళ్ళి చేసేస్తాను నేను" అనేవాడు శాము

"నే నొప్పుకో నసలు మీకుమాత్రం అమ్మాయిని అంత త్వరగా అత్తవారింటికి పంపాలని కోరిగ్గా ఉందా, ఏమిటి?"

"జానీని ఎక్కడికి పంపను మనింట్లో ఉండగలిగే వాడినే వెతికి పెళ్ళి చేస్తాను. అప్పుడు జానీ, అల్లుడూ, వారి పిల్లలూ అందరూ మనింట్లోనే ఉంటారు"

"నాకేమో వీణకు పెళ్ళి చేయాలని లేదు."

"అలాగే వదిలేద్దామంటా వేమిటి కొంపదీసి?"

"ఊహూఁ మెడిసిన్ చదివిస్తాను నా ఆశ ఎలానూ తీరలేదు. నా కూతురిని చదివించైనా ఆ ఆశ తీర్చుకుంటాను."

"నాకు జాని ఎక్కువగా చదవటం ఇష్టం లేదు"

"నాకు దానికి తొందరగా పెళ్ళి చేసి సంసారంలో పడేయటం ఇష్టంలేదు."

వీణ కాళ్ళలోని అందెల గలగలలతో ఇద్దరి వాదన ఆగిపోయి ఆటు తిరిగేవారు

ఒక్కోసారి శాము, "జానీకి చదువు మీది కన్నా, పెళ్ళి చేసుకొని సంసారం చేయటంలోనే ఆసక్తి ఉంటే. ." అనడిగేవాడు.

"తనలా ఇష్టపడితే అలాగే చేయమంటాను కాని వీణ డాక్టరవుతానంటె?"

"వద్దనను. 'నీ కెలాగిష్టమైతే అలాగే చేయమ్మా' అంటాను"

"వీణా నీకేది కావాలమ్మా?" అంటూ వీణని ముద్దెట్టుకునేది మీర.

రాత్రివేళల్లో వీణ లేచి ఏడిస్తే శాము లేచి ఉయ్యాల వూపేవాడు ఒక్క నిముషం కూడా తను ఆపుకోలేని శాము తన ముద్దుల పాపని

44 వ పేజీ చూడండి















కృష్ణకుమారి

('సింహాచలక్షేత్ర మహిమ' చిత్రం నుంచి)

# సంపెంగలూ సన్నజాజులూ

అవసరాల రామకృష్ణారావు



## జరిగిన కథ

మంజుల వివాహం కోసం కట్నం తీసుకొని కొడుకు పెళ్లి చేస్తాడు తండ్రి. తర్వాత మంజుల వివాహం అవుతుంది సహృదయం గల అన్న చెల్లెల్ని చదువుకోమని సలహా యిస్తాడు. ఆరేళ్ల గడిచేప్పటికి బి య్యే. పట్టాతో బాటు నాలు గేళ్ల మధురిమను కూడా పొందుతుంది మంజ ఎం ఏ. పరీక్షకు బలవంతంచేసి భర్తని ఒప్పిస్తుంది. కానీ ఆమె పాసవుతుంది, భర్త ఫెయిలవుతాడు తనకు చదువు మీద శ్రద్ధ లేదని చెప్తాడు ఫైనల్‌కి వెళా లనుకొన్న మంజుకు మొదట ఆశాభంగం కలిగినా తర్వాత ఉద్యోగం వేయననే ఆమె షరతుకు ఒప్పుకుని అంగీకరిస్తాడు భర్త మంజ అన్నయ్య సంసారం కుంటుపడుతుంది న్యాయం పేరుతో ఉద్యోగాన్ని వదులుకునే స్థితికి వస్తాడు ప్రసాదరావు భర్తకు తెలీకుండా తన నగను అమ్మి అన్నయ్య అప్పును తీరుస్తుంది ఇంటికి తిరిగి వచ్చిన మంజ, భర్త ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నట్లు, అప్పులు చేసినట్లు తెల్సుకుంటుంది. అన్నయ్య సంసారం గురించి, ఆరోగ్యం గురించి ఏవిధమైన సమాచారం తెలియకపోవడంవల్ల ఆందోళన పడుతుంది మంజ. అక్కడికి వెళ్లిచూద్దామన్నా వీల్లేకపోతుంది తనకు తెలియకుండా నగ అమ్మిందని మంజ భర్త ఆమెపై కోపగించుకుంటాడు భార్యాభర్తల మధ్య మనస్పర్థలు చెలరేగుతాయి.

## 17

మీరు చాలా తొందరపడుతున్నారని మళ్లీ మళ్లీ చెబుతున్నాను నేను తొందరపడి ఉంటే క్షమాపణ చెప్పుకుంటున్నాను ఏ ఆడదీ కూడా పుట్టింటివారిని దూషించడం సహించలేదు అందులో అన్నివిధాలా యోగ్యుడై ఆపదల్లో అనారోగ్యంతో తీసుకుంటున్న అన్నయ్యనంటే భరించ లేదు. అనవసరమైన, అనుచితమైన సంభాషణలు కొన్ని చేసి ఉంటే మరోసారి వేడుకుంటున్నాను, నన్ను మన్నించండి. నాకు వాడేదైనా చేసిఉంటే అది మహోపకారమేగాని మరోటి కాదు డబ్బుగాని, చాకిరీగాని నానుంచి వాడు ఎప్పుడు ఆశించీ యాచించీ ఎరగడు ఎవరిచేత ఏటువంటి ఉపకారం పొందవలసి వస్తుందో అన్న తపనతో శరీరారోగ్యాన్ని కూడా దాచిపెడుతున్న త్యాగమూర్తి వాడు అహంకార మన్నది నాకు ఉంటే వాడు దాన్ని మొదల్లోకి తుంచేస్తాడు గాని నిలువెత్తున విజృంభించనీయడు ఇక నా చదువు నాకు ఇచ్చినదేమో చెప్పగలిగే స్థితిలో లేను. మీ దగ్గర తలదాచుకోవాలనీ, మీ సేవలో మైమరచి పోవాలనీ నాలో ఉండే నిత్య నూతనమైన అభిలాషకూ, నా చదువుకూ ఏమాత్రమూ సంబంధంలేదు. నే నింతగా మారిపోయాననీ మీరు వూహించడానికి మీకే పరిస్థితులు దోహదం చేశాయో తెలుసుకోవలసిన అవసరం నాకు మరీ మరీ ఉంది. ఇంతగా దుష్ఫలితాలూ, దురభిప్రాయాలూ కలుగుతాయని తెలిస్తే నా సర్వస్వమైన మీ కంటె నా చదువు ముఖ్యమని పరిగెత్తేదాన్నికాను ఒకవేళ వెళ్ళినా కామేశ్వరీ వదినని ఇక్కడుంచి వెళ్లడమంత తెలివి తక్కువ పని చేసి ఉండేదాన్నికాను భార్యా భర్తలమధ్య ఇంతగా అభిప్రాయ భేధాలుతెస్తే అవతలివాళ్లకేం కలిసి వస్తుందో నాకు తెలీదు'

'మధ్య దాన్ని అనుకోడం దేనికి ? నా వాళ్లు అన్నది ఎవరైనా ఉంటే అదొకర్తే ఉందనా?'

ఆయన ఇంకా అలా మాటాడుతున్నప్పుడు ఇంక ఆ కామేశ్వరి విషయం అక్కడికి ఆపుజెయ్యడమే ఔచిత్యమని నా కనిపించింది.

పది నిముషాలు నిశ్శబ్దంగా భయంగా గడిచాయి ఇకనైనా రాజీకి దిగడం నాకు మంచిదనిపించింది

'ఇన్నాళ్ళ నేను ఇల్లు విడిచిపెట్టి వెళ్ళినా మీ బుద్ధి చలించలేదు. ఇంతసేపు మనం తీవ్రంగా వాదించుకున్నా మీరు చెయ్యి చేసుకోలేదు!

'అవును అవే నా బలహీనతలు అవి ఆసరాగా తీసుకునేగా నువ్వు నామీద ఆధిపత్యం వహిస్తున్నదీ!'

మళ్లీ దెప్పు మళ్లీ నాదే తప్పు మళ్లీ ఎత్తిపొడుపు చెప్పినవన్నీ ఒక్కమాటతో దిగదుడుపు! ఆయన చెయ్యి గట్టిగా పట్టుకున్నాను

సూటిగా కళ్ళల్లోకి చూశాను స్పష్టంగా చెప్పేను

'చూడండి, ఎందుకు మీరీ రోజు ఇలా మాట్లాడుతున్నారు? నేనే విపత్కర పరిస్థితుల్లో నగను అమ్మవలసి వచ్చిందో వినరా? అలా అమ్మమని మా అన్నయ్య నన్నడగలేదనీ, ఒకవేళ ఎరిగిఉంటే దానికి ఎంతమాత్రమూ అంగీకరించి ఉండేవాడు కాడనీ మీరు ఎంత చెప్పినా గ్రహించరా? మీతో చెప్పకుండా అమ్మినందుకు నే నెంతో విచారించాననీ, విచారిస్తున్నాననీ పదే పదే చెప్పినా వినరా?' ఆయన మాటాడలేదు ఒక్కొక్కప్పుడు మౌనమే చెప్పలేని ధైర్యమూ, ప్రోత్సాహమూ ఇస్తుంది నే నిక ఆగలేదు

'ముందు జరిగింది వినండి. స్టేషనుకువచ్చి నన్నింటికి తీసుకెళ్ళినదీ, అన్నయ్య ఇష్టానికి వ్యతిరేకంగా వాడిరోగాన్ని గురించి నాకు పూస గుచ్చినట్టు చెప్పినదీ వదినే. వాడితో దెబ్బలాడి నేను చేయించగలిగింది ఏమైనాఉంటే అది డాక్టరుకి చూపించడం. వాడి దేహస్థితి గురించి డాక్టరు సంతృప్తి కనపర్చకపోగా ఆ రోగం తగ్గడం ముఖ్యంగా మానసికారోగ్యంమీద ఆధారపడి ఉంటుందన్నాడు. ఆ పక్కింటి నిర్మలవల్ల వాళ్ళు బాధపడ్డానికి ముఖ్య కారణమైన ఆర్థిక ఇబ్బందిగురించీ ముఖ్యంగా వెయ్యి రూపాయిల అప్పు గురించీ తెలిసింది. ఆఖరికి వదిన అయినా నాకీ విషయం తెలియజేయలేదు ఆ పరిస్థితుల ఒత్తిడిలో నేను కొంచెం తొందరపడినమాట వాస్తవమే. కాని ఆ పరిస్థితులనుంచి మరొక రకం విముక్తి లేదు. చెబితే పద్దని దెబ్బలాడుతాడని మధురిమకు గొన్ను కొంటానని వంకపెట్టి ఆ అమ్మాయి సహాయంతో అప్పటికప్పుడు నగ అమ్మి ఋణం తీర్చాను నేనే కాదు ఆ పరిస్థితుల్లో మీరున్నా అలాగే చేద్దురని నా నమ్మకం. ఏం, మాటాడరు?'

ఆయన అయిష్టంగా అటు తిరిగిపోయారు నే నెంత ప్రయత్నించినా వారిని ఈ విషయంలో సమాధానపరచలేనని మొదటిసారి తెలిసినప్పుడు నా మనసు చివుక్కుమంది ఒక మంచి పని చేసి ఓటమి అంగీకరించడానికి నా మనస్సు ఎంతమాత్రం ఒప్పుకోలేదు. పైగా ఆయన్ని అయన సమర్థించుకోడం నాకు చెప్పలేని చికాకు కలిగించింది.

'నువ్వు చేసిన పని సరైనదికాదని నువ్వే ఒప్పుకుంటున్నావని నేను నిరూపించగలను కూడా. లేకపోతే రాగానే ఆ విషయం చెప్పక ఇన్నాళ్ళ తప్పు చేసిన దానిలాగ దాపరికం దేనికి? నే నేదో విషయం చెప్పపోతే దీన్ని జోడించడం దేనికి? తొందరపడ్డాననీ, పొరపాటు చేశాననీ, మన్నించమనీ, క్షమించమనీ అనేక విధాలుగా వేడుకోడం దేనికి?'

నా నోట మాట రాలేదు నా మౌనాన్ని ఆయన చాతకానితనంగా తీసుకున్నారు

'అంతులేని నమ్మకమూ అనంతమైన విశ్వాసమూ నీమీద ఉంచడమే తప్పు నీది నా దనుకుని నీ నెక్లెసు ఉపయోగించుకోడమే తప్పు సంవత్సరాల తరబడి భర్త సంపాదనపై ఆధారపడి బ్రతికి, అవసరం వచ్చినపుడు ఖర్మం చాలక నగమ్ముకుంటే తన డబ్బుని భర్త వాడుకున్నాడని బతికున్నన్నాళ్లూ జ్ఞాపకంచేసే భార్యల జాబితాలో నిన్ను వెయ్యకపోడమే తప్పు నీ చంద్రహారాలు నువ్వు అమ్ముకున్నప్పుడు అదేమని అడగడం అంతకంటె తప్పు అధ మాధమని శాస్త్రాలు ఘోషించిన స్త్రీ వివేకాన్ని ఆశించడం అంతకంటె పెద్ద తప్పు'

ఆయన అక్కడ్నుంచి లేచి నే నండమంటున్నా వినకుండా పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ వీధిగదిలోకి వెళ్ళిపోయి తలుపేసుకున్నారు. ఎన్నిసార్లు

తట్టినా తలుపు తియ్యలేదు. నే నక్కడ (స్తాన్పడి కూలబడిపోయాను దాసీది పిలిచి పిలిచి వెళ్ళిపోవడం గాని, పాలవాడు విసుగెత్తి సరళ గారింట్లో ఇచ్చి వెళ్ళిపోవడంగాని నే నెరగను 'ఇదేమి టమ్మా ఇక్క 'డున్నావ్?' అని మధురిమ రాగాలెత్తేదాకా నేను లేచి ఇవతలకు రాలేదు జరిగినది కలో నిజమో దాని సారాంశ మేమిటో నాకు బోధపడలేదు నాకు బోధ పడిందల్లా ఒక్కటే నేను ఆశించింది ఆయననుంచి నాకు లభించలేదు నేను ఆయన్ని అన్నా వారు నన్ను అన్నా అన్నయ్య ఎలా ఉన్నాడో అని అనుక్షణం కొట్టుకుంటున్న నా హృదయం మరింత బరువయిందిగాని తేలికవలేను.

*　　　*　　　*

'అమ్మా అమ్మా ఇవాళ మనింటికి మరొకరు భోజనానికి వస్తారుట' అని మధురిమ నాతో చెప్పి తుర్రున పారిపోయింది అప్పుడప్పుడు ఆయన (ఫండ్సు భోజనానికి రావడం నాకేం కొత్త కాదు. ఇలా మధురిమచేత చెప్పించడమే కొత్త ఒళ్ళు తెలియని జ్వరంతో బాధపడుతున్నవారికి తల నొప్పి ఎంతటిది! కానియ్యి, ఇదెంతవరకో చూద్దాం అన్న మొండితనమే నా కిక మిగిలింది

భోజనానికి వచ్చేవాడు ఆయన ఆఫీసులో కొత్తగా (టాన్స్ఫరై వచ్చిన గుమాస్తా అని తెలిసింది. అతన్ని చూడగానే మటుకు నా మతిపోయింది అతడు హరి గోపాల్!

ముందు టేడు దసరాలకు అన్నయ్య దగ్గరకు వెళ్లి మధురిమను తీసుకుని నే నొక్కర్తినీ రైల్లో తిరిగి వస్తున్నప్పటిమాట. దారిలో ఒక స్టేషనులో ఒకాయన ముగ్గురు పిల్లలతో ఎక్కేడు ఎక్కిందగ్గిర్నుంచీ ఆయన్నెక్కడో చూసినట్లని పించింది ఎంత ఆలోచించినా ఎవరోమాత్రం గుర్తుకు రాలేదు బాగా చూసినట్టుంది మొహం అతనుమాత్రం వెంటనే నన్ను చూడలేదు. చిక్కుల్లోనూ, చికాకుల్లోనూ ఉన్నట్లు చిటపటలాడుతూ ఉన్నాడు దానికితోడు పిల్లలు చాలా చిన్నవాళ్ళు విపరీతమైన అల్లరి సముదాయించలేక సతమతమవుతున్నాడు ఆ పాపను చూసి బుద్ధి తెచ్చుకోండి వెధవల్లారా ఎంత ముద్దుగా ముచ్చటగా కూచుందో! అంటూంటే ఆ కంఠస్వరం విని ఆతడెవడో పోల్చుకుని కొన్ని సంవత్సరాల వెనక్కి వెళ్ళిపోయింది నా మనస్సు

నా కప్పుడు పదిహేడేళ్ళు ఉండేవేమో హరి గోపాల్ అని మా ఇంటి కెదురుగా మేడమీద ఉండి చదువుకొనేవాడు అతడికప్పుడు ఏ ఇరవైయో ఉండేవనుకుంటాను బియ్యే చదువుతూ దండయాత్రలు చేస్తూ ఉండేవాడు

వాళ్లింటి డాబామీదకి మా పెరడు కనిపించేది మా పెరట్లో పెద్ద మొల్ల పందిరి ఉండేది. చిన్న నిచ్చెన వేసుకుని, గంటల తరబడి, ఒక్క మొగ్గ అయినా వదలకుండా అన్ని మొగ్గల్నీ కొయ్యడం నా కెంతో సరదాగా ఉండేది ఒక్కొక్క మొగ్గ అందక బాగా వంగవలసి వచ్చేది అయినా మొగ్గ వదలడానికి నా (ప్రాణం మొగ్గేదికాదు 'పూల మొగ్గ కొయ్యబోయి వాలు మొగ్గ వెయ్యకోయ్' అని వదిన పాడుతూ ఏడిపిస్తూ ఉండేది ఖర్మంజాలక పందిరెక్కుతే ఆ నిచ్చెన తీసి దాచేసేది నాకేం భయం అని చెంగున గంతేసేదాన్ని 'హోసి, ఎంతకైనా తగుదువుగదే' అనేవాడు అన్నయ్య.

అయితే నా యీ చిలిపి చేష్టలు (ప్రతినిత్యం గమనించి ఆనందించే (ప్రాణి ఒకటుందని నాకు తెలీదు ఒకనాడు ఎవరో నవ్వినట్టై వెనక్కి చూసి నా మొహం ఎర్రబడింది నే నటు కోపంగా చూసిన నా అత డక్కడినుండి కదలక పోవడం, పైగా నవ్వడం నా కతనిపై సదభి(ప్రాయం కలగకుండా చేశాయి అతడలా గుచ్చి గుచ్చి చూడటం నాకు చిరాకనిపించింది అన్నయ్యతో చెబుదామని ఉండేదికాని మళ్లీ ఎందుకూ లేనిపోని గొడవ నే నటువైపు చూడకపోతేసరి అని సరిపెట్టుకుని వూరుకునేదాన్ని తరువాత ఆ విషయమే మరచిపోయాను అన్నయ్య నాకు సంబంధాలు వెతుకుతున్నట్టు తెలిసి ఎవరి ద్వారానో తను సిద్ధంగా ఉన్నట్టు కబురంపించాడుట. 'ఆ అబ్బాయికేం తక్కువా?' అని మధ్యవర్తి అడుగుతే 'ఎక్కువేమీ లేక పోవడమే' అని అన్నయ్య జవాబు చెప్పేడుట. 'హరిగోపాల్‌కి నిన్ను చేసుకోవాలని చాలా ఉండేదే, మంజూ ఇటు చదువుగాని అటు ఉద్యోగంగాని సరిగాలేని వాడికి చూసి చూసి నిన్నెలా ఇవ్వను? అన్నాడు అన్నయ్య.

'మీరు హరిగోపాల్ కదూ?' అన్నాను రైల్లో ఆయన్ని చూశాక మనిషి బాగా మారిపోయాడు. సంసార భారంతో (కుంగిపోయిన మనిషిలా కని



# సంపెంగలూ సన్నజాజులూ

పించాడు భార్యను పురిటికి పుట్టింటికి దిగ బెట్టి వస్తున్నాడట. ఈ పిల్లల్ని సాకడానికి అతని తల్లి ఉందిట

అతని మాటతీరు చూస్తే అత నా విధంగా తయారు కావడానికి నేనే కారణమైనట్టు ధ్వనించింది మీ కంటికి మేం ఆనామా అనీ, ఏదో పలకరించారు అంతేచాలు అనీ అతను మాటాడుతూంటే నాకు చాలా అసహ్యమనిపించింది ఆయన ఉద్యోగం గురించి అడిగాడు. చెప్పేను అతనూ అదే డిపార్టుమెంటులో పని చేస్తున్నాట్ట కాని ఏం లాభం? ఆయన నిచ్చెన పై మెట్టుమీద ఉంటే తను కింద మెట్టుమీద ఉన్నాడట. అలాంటి వాడితో సంభాషణ పొడిగించడం నాకేమాత్రం ఇష్టం లేకపోయినా అసలే ఏడుస్తున్న అతనితో బొత్తిగా మాట కలపకపోతే బాగుండదని అన్నాను.

'మీ ఆవిడ ఏం చదువుకున్నారు?'

'మీ దయవల్ల అక్షరజ్ఞానం లేందేంకాదులెండి. స్కూలు ఫైనలు దాకా వెలిగించింది మీ రప్పుడు ఇంటర్‌కి కట్టేరుకదూ, పెళ్లయాక ఆపేసేరనుకుంటూ' లేదనేసి వూరుకున్నాను ఇంకేం చెప్పడం ఇష్టంలేక కాని అతడు నన్ను వూరుకోనీయలేదు. ఎం ఏ. ప్రీవియస్ అయిందని చెప్పగానే తన దేదో పోయినంతగా ముకుళించుకుపోయింది ఆమొహం. కొంత సేపటికి ఏదో షాక్‌నుంచి తేరుకున్నట్టు తేరుకుని 'పిల్లల్ని చూడ్డానికి ఎవరో పెద్దవాళ్లో లేకపోతే దండిగా నౌకర్లూ చాకర్లూ ఉన్నారు కాబోలు లేక మీ ఆయనే ఆడిస్తారో. లేకపోతే ఇంతవరకు ఎలా సాగించగలరులెండి!' అన్నాడు అదోలా వెకిలి నవ్వు నవ్వుతూ

ఇలా మేమిద్దరం మాట్లాడుతూఉంటే వాళ్ల చంటిపిల్ల మూడేళ్లది అలా పాకుతూవెళ్ళి చెరుకపిప్పి ఏది నోట్లో పెట్టుకోబోయింది 'వెధవల తిన్నగా ఉండరు' అని దాన్ని ఒక్కటి వేశాడు అది ఏడుపుకి లంకించుకుంటే 'నోరు మూస్తావ ముయ్యవా' అని మరొకటి వెయ్యబోతే నేను వారించాను. నేను బుట్టలో బిస్కట్లు పొట్లాం విప్పి పెడుతూంటే తక్కిన పిల్లలిద్దరూ నాకో నాకో అని చెయ్యి జాపేరు 'వాపిరిగొట్టు వెధవలు అక్కడికి బిస్కట్ మొహం ఎరగనట్టు' అని అతగాడు విసుకున్నాడు మధురిమ నవ్వుతూ ఇవన్నీ చూస్తూ కూచుంది, మధ్య మధ్య పైకి చూస్తూ

'నే నిందాక అన్నదానికి సమాధానం చెప్పేరు కారు'

'చెప్పడానికేంలేదు మాకు ఈ పాప ఒక్కతే ఈసారి హరిగోపాల్ మొహం మరీ మాడిపోవడం స్పష్టంగా చూశాను

'నాలాంటి దురదృష్టవంతుల్ని బాగుచేసేవారూ మీలాంటి అదృష్టవంతుల్ని చెరిపేవార్లూ లేరనుకుంటాను' అలా మొహంమీదే అంటూంటే ఇక వూరుకోలేకపోయాను

'లేరు. కాని బాగుపడ్డ వాళ్లనుచూసి ఏడ్చేవాళ్లూ చెడిపోయిన వాళ్లనిచూసి నవ్వుకునేవాళ్లూ ఎక్కడపడితే అక్కడే ఉన్నారు!'

ఈమాట అతని నసాళానికి అంటిందను కుంటాను నావైపు తేరిపారచూశాడు విషాదమూ, క్రోధమూ కలసిఉంది ఆ చూపులో అంతే తరువాత రెండు మూడు గంటలు కలసి ప్రయాణం చేసినా అతను నాతో మాటాడలేదు అసలే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో బాధ పడుతున్నట్టున్నాడు అతన్నెందుకు ఇంకా బాధించినట్టు? అని నా మనసే నన్ను నిలదీసింది అది అక్కడితో అయిపోయిందనుకున్నాను

ఆయన వెనక కాళ్లు కడుక్కుని భోజనానికి వస్తున్న హరిగోపాల్‌ని తలెత్తి చూశాను. సరిగా అదే సమయంలో అతడూ నా వైపు చూశాడు. అసూయా క్రోధాలతో వింతగా ముడుచుకుని ఉన్న ఆ కళ్లనూ వక్రంగా మలచబడిన ఆ కనుబొమలనూ చూస్తూంటే భయంవేసింది అదృష్టవశాత్తూ ఆవేళకు సరళ వాళ్లింట్లో భోజనాలయి నాతో మాటాడుదామని వచ్చింది

'చెల్లీ సమయానికి వచ్చావు ఎవరో ఆయన స్నేహితుడు కూడా వచ్చాడు భోజనానికి వంటేమో ఎలాగో చేసేశాను తల ఎగిరిపోతోంది కాస్త వడ్డించి పెడుదూ' అన్నాను బతిమాలుతున్నట్టు

'అయ్యో ఈమాత్రం సాయానికి కొత్తదానిలా అంతగా నాకు చెప్పాలా అక్కా, ఉపకారమంటే పూర్ణొంచి పారిపోలేంగదా' అని సరళ పమిట చెంగు దోపుకుని వడ్డనకు ప్రారంభిస్తే నా పోయిన ప్రాణం లేచొచ్చింది.

'అదేమిటి నువ్వు వడ్డిస్తున్నావ్?' అన్నారు ఆయన సరళతో

'అక్కయ్యకు తలకాయ నెప్పిగా ఉందిట.'

'బాగుంది వరస' అన్నారు ఆయన కటువుగా

'ఇంట్లో వాళ్లకి అసలే బాగులేనప్పుడు నన్ను కూడా తీసుకొచ్చి ఇబ్బంది పెట్టడం ఎందుకండీ మరీ అన్యాయం' అన్నాడు హరిగోపాల్ అన్నమూ, మాటా కలుపుతూ

'ఇంట్లో వాళ్లకి కులాసాగా ఎప్పుడుంటుందో, ఎప్పుడు చిరాగ్గా ఉంటుందో తెలుసుకోడం కూడా అంత సులువైన విషయం కాదండీ హరిగారూ!' అన్నా రాయన మరందులో నవ్వడానికో ముందో నాకు తెలీదుగాని ఇద్దరూ కలిసి ఇళ్లెగర గొట్టేశారు

అయితే తరువాత జరిగే హింసాకాండకు అది ప్రారంభోత్సవం మాత్రమే అని నేను తెలుసుకోలేక పోయాను ఈవిషయంలో హరిగోపాల్ ప్రధాన పాత్ర తీసుకుని తనమీద నా మనసులో ఉన్న విషమూ, కసి అంతా కక్కేసినట్టు కనిపించింది అసలే నామీద అక్రమంగా పగ బూనిన ఆయనయిందులో పాల్గొనడం నాకేమంత విచిత్ర మనిపించలేదు ఈ విషయంలో పూర్వాపరాలు తెలియని సరళే అన్నివిధాలా బాధపడిందనుకుంటాను నిశ్శబ్దంగా భోజనాన్ని ముగించే ఆయన భోంచేస్తున్నంతసేపూ మాట్లాడ్డం మాత్రం కొత్తగా కనిపించింది దూరంగా వంటగదిలో కూచున్నా వాళ్ల ప్రతి అక్షరం నా చెవిలో పడుతూనే ఉన్నది

'వీళ్లు ఎంత చదువుకోనియ్యండి వీళ్లని మనం వింతగా చూడనియ్యండి ఈ ఆడవాళ్ల అభిమానం ఎప్పుడూ పుట్టింటి వారి మీదే ఉంటుంది. వాళ్లకి మింగ మెతుకు లేకపోయినా సరే, చచ్చే పరిస్థితులో ఉన్నా, వాళ్ల దగ్గిరనుంచి నయాపైసా మనకి పుట్టకపోయినా సరే వాళ్లనే ప్రాణప్రదంగా భావిస్తారు. మరి ఇందులో కీలకం ఏమిటో నాకు ఎంత ఆలోచించినా అర్థంకాదు'.

అని మొదలు పెట్టేడు హరిగోపాల్ ఆ పరిస్థితిలో ఆకబుర్లు, విస్తర్లో వడ్డించిన బూర్లు కన్న తియ్యగా ఉన్నాయను కుంటాను శ్రీవారికి ఊరికే ఉండలేక రుచి ఎలా ఉందోనని పులిహోర ఇంత నోట్లో వేసుకుని పొరపాటున మిరపకాయ కొరికిన నాకు అంతకన్న కారంగా ఉన్నాయి అవే కబుర్లు!

'మా బాగా చెప్పేరు హరిగారూ!'

'మరేమను కున్నారు రామమోహనరావుగారూ, అంతగా ఒళ్లు మండిపోతూంటే లనుకోకేం చేస్తాం చెప్పండి మా వెంకట రత్నమే ఉందా, వాళ్ల నాన్న దానికి నెలకి పది రూపాయలు పంపుతాడు సను పూకుంకానికి సంతోషమే ఖర్చు పెట్టుకోమనండి, ఎవడికాక్కావాలి? అహోరాత్రాలు కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకొని నెలయేసరికల్లా నేను తెచ్చి చేతిలో పోసే నూటయాభై దాని కంటికి ఆనవు అవేవో చిల్ల పెంకులు అనుకుంటుంది కాబోలు అదిగో వాళ్ల బాబు అహోబిలంగారు పంపే ఆ పది రూపాయలే బిళ్ల కుడుములు కాబోలు తేడా గమనిస్తున్నారా? నన్ను మన్నిస్తే ఒకమాట అడుగుతాను. ఇలాంటివి అనుభవంలోనికి రాని అదృష్టవంతులేమో తమరు మరి!'

'బాగుంది. అత్తారింటివారి బాధ అనుభవించని అల్లుడూ, వానకి తడవని నరుడూ ఉంటాడా?'

'మా బాగా శెలవిచ్చేరు పైకి నీటుగా ముస్తాబై తిరుగుతున్న ప్రతి మనిషికీ యింతో అంతో చింత ఉండక మానదుమరి!'

ఈరాయి పూర్తిగా నాకు తగలాలని విసిరింది. ఆనాడు రైల్లో నేనూ మధురిమా పరిశుభ్రంగా ఉండి మంచి బట్టలు కట్టుకుని ఉండడం అదో అపరాధం. నాలుగురోజుల క్రిందటవే చాకలాడికి వెయ్యవలసిన బట్టలు ధరించి, మొక్కకి సరిపడే గెడ్డాన్ని పెంచి ఏడెనిమిదేళ్ల పిల్లలకయినా ఓ లోపలి లాగులయినా లేకుండా రైలు ఎక్కించి, లోకంలో ఉన్న బాధా చీకటీ ఎక్కువ చెయ్యడానికే మేం బయలుదేరాం అన్నట్టు హరిగోపాల్, ఆయన కుటుంబంలాగ తయారవకపోడమే మేం చేసిన తప్పు. ఇంతకీ అతన్నేం లాభం, ఈయనింతగా దిగజారి పోయాక!

"ఒకసారి ఒళ్లు మండిపోయి మా మామగారికి ఉత్తరంరాసి పడేశాను 'అయ్యా అహోబిలంగారూ, మీ అమ్మాయి సంసారం చల్లగా ఉండాలంటే ఆ సొమ్ముమాత్రం పంపకండి లేదూ, నేను కాళ్లు జాపుకు కూచుంటాను మీరే నెలకి ఏ రెండొందలో పంపుతూ ఉండండి ఇటూ అటూ కాకుండా మాత్రం మా ప్రాణాలు తీయకండి' అని రాశాను దాని కాయన జవాబు రాయలేదుగాని ఆ తరువాత్తరువాత మా వూరు వచ్చినపుడు అంటాడు : 'మా అమ్మాయికి నేనేదో పంపుకుంటే నీ కెందుకోయ్ మధ్య అంత ఇదీ?' ఆహా అలా ఉందా నీ వ్యవహారం అని మనసులో అనుకొని అక్కణ్ణుంచి అదెప్పుడు నన్ను కాని అడిగినాసరే 'మధ్య నా కెందుకు అంత ఇది? మీ బాబున్నాడు, నువ్వున్నావు కావలసింది రాసి తెప్పించుకో' అని చెప్పుతూ వచ్చేను. ఏమనుకుందో ఏమిటో ఇక సొమ్మేం పంపొద్దని తండ్రికి రాసేసింది అద్దైనా ఎంత బ్రహ్మాండంగా రాసిందను కొన్నారు? 'నాన్నా, నువ్వు నీ ఖర్చులు మానుకుని నాకు సొమ్ము పంపడం దేనికి? నీకు డబ్బెక్కువయిందా? ఇంతకీ నువ్వు వెర్రి అభిమానం



## భారీ యెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

డ పంపుతే ఏ వెల కానేం పెద్ద పులిలా మీద
డి లాక్కోడమేగాని నీ సొమ్ము నవ్వాయన ఖర్చు
పెట్టుకో నిచ్చిందెపుడు?' బాగుందాండి, ఇదీ
రస ఇదీ మా వెంక(టత్నం నన్ను అర్థం చేసు
న్నది. ఏం చెప్పమంటారు?" ఆయన మాట్లాడ
లేదు అత్యాసక్తితో వింటున్నారు. 'చెప్పండి చెప్పండి'
అంటూ తనివి తీరలేదు కాబోలు పాపం!

"చెప్పడాని కేమీలేదూ, దీన్నిబట్టి మనం నేర్చుకో
లసింది ఎంతయినా ఉంది ఎక్కడ వాళ్ళను అక్క
డుంచడానికి మొదట్నుంచీ తగిన కట్టుదిట్టాలు
నేసుకోవాలి పుట్టింటి వారి రాక పోకలు వీలైనంత
వరకు తగ్గించడానికి (ప్రయత్నించాలి ముఖ్యంగా
ఏ పరిస్థితుల్లోనూ ఆడదాని చేతికి పెత్తనం
ఇవ్వకూడదు. అందులో చదువుకున్నదైతే మరింత
మెలకువతో ఎప్పుడూ వో కంటితో కనిపెట్టి
ఉండడం అన్ని విధాలా (శ్రేయస్కరం నాకు తోచిన
మాట చెప్పేశాను. ఎవరేమనుకున్నా సరే'

'బావకి పిడెక్కడ దొరికాడక్కా, (స్త్రీ జాతిని
దూషించడానికి పుట్టిన (ప్రబుద్ధుడులా ఉన్నాడూ'
అంది సరళ వాళ్ళు భోజనాలకై వెళ్ళిపోయాక

'ఎవడో ఒక చరిత్రహీనుడు! లోకంలోని
భయంకర రోగాల్లో భయంకరమైన అసూయా
వ్యాధి పీడితుడు! వీళ్ళనికాదు, వీళ్ళను ఆహ్వానించి
ఆలకించిన వాళ్ళని అనాలి!" అన్నాను.

* * *

పొద్దుటి పోస్టులో ఉత్తరం వచ్చింది పై
ముద్ర చూడగానే వేళ్ళు ఒణికాయి అది వచ్చింది
బెనారస్‌నుంచి అక్కడ నా నెంబరు రెండొందల
ఒందొమ్మిదని చెప్పి మరీ వచ్చేను, రిజల్ట్సు బహి
రంగ పరచగానే తెలియజెయ్యమని నేను సెకండ్
క్లాసులో ప్యాసయ్యానుట పడిన (శమకు సత్ఫలితం
కలిగిందన్న సంతోషంతో కలిగిన ఉద్రేకోత్సాహ
ంతో కొంతసేపు ఆనందించాను. అంతలోనే
అప్రయత్నంగా నా కళ్ళలోకి నీళ్ళు వచ్చాయి
ఎక్కువ సుఖమైనా దుఃఖమైనా పంచుకోడానికి
ఆప్తులు కావాలి ఆయన చూస్తే ఈ మాది
రిగా ఉన్నారు అన్నయ్య దగ్గిర్నుంచి జవాబు
కైనా నోచుకోలేదు మధురిమను ఎత్తుకుని
ముద్దు పెట్టుకుని "నేను సెకండు క్లాసులో
ప్యాసయ్యానుటే మధూ!' అని చెప్పుకునేదాకా
నాకు ఉండబట్టలేదు దాని ఆనందం చూస్తే
నా బాధంతా చేత్తో తీసేసినట్లయిపోయింది అది
గంచు మించు డ్యాన్సే చేసింది చప్పట్లు కొట్టి
గెంతింది 'మా అమ్మ పరీక్ష ప్యాసయిందోచ్చి! మా
అమ్మ ఎం ఏ తెలుసా?' అని తన (ఫ్రెండ్సుతోనూ
రంగితోనూ, పోతురాజుతోనూ, సరళతోనూ
అందరితోనూ చెప్పి వచ్చింది అయినా దానికి
సంతుష్టి కలిగినట్టులేదు వారి దగ్గిర కెళ్ళి నాన్నా,
నాన్నా, అమ్మ పరీక్ష పాసయిందట తెలుసా? అలా
ఇలాకాదు, సెకండు క్లాసులో!' అని అంటే 'అలాగా
సంతోషం ఆ కబురు తనే వచ్చి చెబితే సంతో
షించే వాళ్ళంగా!' అన్నారు. నాకు వినపడేలాగ.
సరే అదెంత ముచ్చటగా ఉందో అని నేనే వెళ్ళేను.

"ఏమండీ, ఇప్పుడే ఉత్తరం వచ్చింది భగవం
తుడి దయవల్ల ఏదో గట్టెక్కేను మీరు కూడా
వచ్చి పరీక్ష ప్యాసై ఉంటే నాకు మరింత నిండుగా
ఉండేఉండును, ఈ ఏడాది (ప్రీవియస్ పేపర్లు

## సంపెంగెలూ సన్నజాజులూ

చాలా సులువుగా ఉన్నాయిట కూడా'! అన్నాను
'నువ్వు పాసయావని చెబితే తీరిపోలేదూ, దాంతో
నన్ను కూడా పోడించి కించపరచి నీ ఆధిక్యం
బయట పెట్టుకుంటేగాని నీకు సంతుష్టి ఉండ
దనుకుంటాను!' నా సంతోషమంతా ఒక్కసారిగా
చప్పగా చల్లారిపోయింది. మొహం ముడుచుకు
పోయింది ఇక అక్కడ ఉండ బుద్ధి పుట్టలేదు.
తగిన జవాబు చెబుదామని నోటిదాకా వచ్చిందిగాని
పూర్వానుభవం నన్ను మారు మాటాడ నియ్యలేదు.

ఆ తరువాత ఒకవారం రోజులపాటు నాకు వచ్చే
పోస్టు అభినందన పరంపరతో నిండిపోయింది.
ముఖ్యంగా రుక్మిణమ్మగారూ, మధురా నన్ను అభి
నందిస్తూ రాసిన ఉత్తరాలు మరచి పోలేనివి.
మధుర (ప్రీవియస్‌లో పాసయిందిట. అలా యిలా
కాదు యాభై పర్సంటు మార్కులతో! నాకు
ఆనందం ఆశ్చర్యం ఒక్కసారే కలిగాయి ముప్పొ
ద్దులా ముస్తాబవడంతో గడిపేసే ఆ అమ్మాయి
రాత్రయ్యే పరికల్లా బుద్ధిగా చదవడం, మంచి
మార్కులతో పాసవడం ఎంత వింతగానైనా ఉంది.
వెంటనే ఆ కేశవరావు కూడా జ్ఞాపకానికి వచ్చాడు
పైకి ఎంత మంచివాడులా కనిపించేవాడు, నిజానికి
ఎంత దుర్మార్గుడు! 'మా ఇంట్లో అందరూ మీకు
తమ హృదయ పూర్వక అభినందనలు తెలియజేయ
మన్నారు ఎక్కడికైనా అప్లై చేస్తున్నారా?'

అని రాసిన మధుర [illegible] (శుభ్ర)పెద్దా[illegible]
ఇంకా రిజల్ట్సు తెలిసి పదిరోజులు కూడా అవ
లేదు మార్కుల లిస్టు వచ్చి రెండ్రోజులు దాట
లేదు. అప్పుడే ఉద్యోగమా? నేను చదువుకున్న
దెందుకు? ఉద్యోగం చెయ్యడానికేనా?

ఏమనుకున్నారో ఏమో ఆయనకే తెలియాలి.
ఈమధ్య నాలుగైదు రోజులై పేకాట మకాం
క్లబ్బునుంచి మా మేడమీదకి మార్చేశారు ఇది
హరిగోపాల్‌గారి అమూల్యమైన సలహా అనుకుం
టాను అతగాడు కూడా ఈయన్ని క్షణం వదిలే
వాడుకాడు. అయితే భోజనం మాత్రం ఏ హోట
ల్లోనో చేసి వచ్చేవాడు. ఆఫీసు బాయ్‌ని రాత్రి కిక్కడ
ఉంచేసి వాడిచేత కావలసినన్నిసార్లు కాఫీలూ, టీలూ
సిగరెట్లూ తెప్పించుకునేవారు.

అలా పూరా వాడా ఎగిరి పోయేటట్లు వాళ్ళు
మేడమీద గోల చేస్తుంటే రాత్రివేళ (క్రింద
పడుకున్న నాకు నిద్రెలా పడుతుందీ? అదృష్ట
వశాత్తూ నారాయణ వాళ్ళ ఆఫీసరుతో క్యాంపుకు
వెడితే ఆ నాలుగు రోజులూ సరళ నా దగ్గిరకివచ్చి
సాయంగా పడుకునేది సరళ ఒక మంచంమీదా,
నేనూ మధురిమా మరోక మంచంమీదా పక్క పక్కన
పక్కలు వేసుకుని పడుకునేవాళ్ళం. మధురిమ
వెంటనే పడుకునేది మరో అరగంటకి ఆ కబురూ
ఈ కబురూ చెబుతూ సరళ నిద్రపోయేది ఇక
మిగిలింది మేడమీది రాత్రించరులు వాళ్ళూ (క్రింద
నిశా పిశాచిని నేను! (సశేషం)



## 16-4-1965 శుక్రవారం మొదలు 22-4-1965 గురువారం వరకు.

**మేషం :** వారంమధ్యలో చికాకులకు గురి కావడం వలన వారాంతానికి వృత్తి వ్యాపారాల్లో కొంత అనుకూలత లభించినా ఈ వారం మొత్తంమీద అంత సంతృప్తికరంగా కన్పించదు సాహసముతో కూడిన వ్యవహారాల్లో వారం మధ్యలో నష్టం వస్తుంది భారీ ఎత్తునచేసే వ్యాపారాల్లో కొత్త సమస్యలు తలఎత్తుతాయి వృత్తిలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది ఆరోగ్యం ప్రస్తుతం బాగానే ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు శుభ మూలంగా ధన వ్యయం జరుగుతుంది

స్త్రీలకు—ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి కళాకారిణులకు మంచి సమయం

**వృషభం :** వృత్తివ్యాపారాల్లో సాటివారితో భేదాభిప్రాయాలు రావడంవలన మానసికాందోళన కలుగుతుంది వ్యాపారంలో మీరు అనవసరంగా తొందరపడడంవలన చేజిక్కిన అవకాశాలను కోల్పోవచ్చును వృత్తిలో కొంచెం కష్టంమీద యధాతధ స్థితిని కాపాడుకొంటారు రావలసిన డబ్బు సమయానికి అందదు స్థిరాస్తి వ్యవహారాలు అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలలో మార్పులు వస్తాయి సంతోషకరమైన వార్తలను వింటారు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మిధునం :** కొన్ని వ్యవహారాల్లో వారం మధ్యలో అనవసరమైన వ్యయం జరిగినా మొత్తంమీద వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగా ఉంటుంది భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవచ్చును వృత్తిలో ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటే బాగానే ఉంటాయి కాని భారీ వ్యవహారాల్లో సాహసం తగదు సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయకూడదు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది దైవ కార్యాలు నెరవేరుతాయి

**కర్కాటకం :** ప్రతి వ్యవహారంలోను ఏదో ఒక ఆటంకం కలిగేటట్లు కన్పిస్తుందికాని మీరు సమయస్ఫూర్తిగా వ్యవహరించడంవలన వృత్తివ్యాపారాల్లో వారాంతానికి స్వల్పాభివృద్ధిని సాధించగలరు వారం మధ్యలో సాహసముతో కూడినవ్యవహారాలు కూడా లభించవచ్చును వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి ఉద్యోగంలో మీకంటే పెద్దవారు కూడా మిమ్మల్ని గౌరవిస్తారు కోర్టు వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ నాయకులకు మంచి సమయం.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| బు | ర శు | గు రా | |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | కు |
| | కే | చం | |

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది నూతన విషయాలను తెల్సుకొంటారు

**సింహం :** మీ స్వంతవ్యవహారాలు సులువుగానే నెరవేరినా ఇతరుల పనిమీద మీరు శ్రమకు గురి కాగల సూచనలు ఉన్నాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకొన్నట్లుగా సాగకపోవచ్చును వృత్తిలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఇప్పుడు కార్యరూపం ధరించవచ్చును రావలసిన డబ్బు సమయానికి అందుతుంది విద్యా వైజ్ఞానికరంగాల్లో అభివృద్ధిని సాధించగలరు రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పిస్తుంది బంధు మిత్రులను కల్సుకొంటారు విలాస వస్తువులు కొంటారు

**కన్య :** ఇంతవరకు వ్యాపారంలో మీకు అనుకూలంగా ఉన్నవారే ఇప్పుడు మిమ్మల్ని వ్యతిరేకించడంవలన మీవారెవరో పైవారెవరో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది వ్యాపారంలో సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టంవస్తుంది ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిదికాదు ఆదాయం మామూలుగానే ఉన్నా ఏదో ఒక విధంగా అవసరానికి డబ్బు అందుతుంటుంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగానే ఉంటాయి బంధువుల వ్యవహారాల్లో చికాకులు రావచ్చును పుణ్య కార్యాలు చేస్తారు

**తుల :** మీరు ఎంత ప్రయత్నంచేసినా, కొన్ని వ్యవహారాలు మీ అదుపుతప్పి వూహించని పరిణామాలకు గురి కాగల సూచనలు ఉన్నాయి మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి రావలసిన డబ్బుమీద ఆధారపడి ఇతరులకు వాగ్దానాలు చేయడంవలన మున్ముందు ఇబ్బంది కలుగుతుంది వృత్తిలో ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది

### ఈవారం ధరలు

అపరాల ధరలు నిలకడగా ఉండి వారాంతానికి కొంచెం తగ్గవచ్చును పసుపు ధర పెరగగల సూచనలు ఉన్నాయి బెల్లం ధర క్రమంగా పెరుగుతుంది నూనె నువ్వుల ధరల్లో ఒడుదుడుకులు వస్తాయి. బట్టల ధరలు కొంచెం తగ్గవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది సాంఘిక వ్యవహారాల్లో వాద ప్రతివాదాలకు దిగడం మంచిది కాదు ప్రయాణాలోచనలు చేస్తారు

**వృశ్చికం :** వారం ప్రారంభంలోనే మీరుకొన్ని చికాకులకు గురి కావచ్చునుకాని వారాంతానికి అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలరు దీర్ఘకాలానికి ఫలితాల్ని ఇచ్చే భారీ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో సాటివారితో పోటీ తగ్గుతుంది ఉద్యోగంలో మీకు ఇదివరకు ఇబ్బంది కలిగించిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడినా నిష్ఫారం తప్పక పోవచ్చును

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు సంఘ సేవికలకు మంచి సమయం.

**ధనుస్సు :** ఆదాయంబాగానేఉన్నా, వృత్తి వ్యాపారాల్లో కార్యసాధనకోసం మీరు కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసిన అవసరం ఏర్పడడంవలన ఈవారం అంత సంతృప్తికరంగా ఉండదు భాగస్వాములతో వారం మధ్యలో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి ఉద్యోగంలో సాటివారి గౌరవాన్ని పొందగలరు రాజకీయ వ్యవహారాల్లో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి పుణ్య కార్యాలు చేస్తారు

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు వారం ప్రారంభంలో ప్రోత్సాహకరంగానే ఉంటాయి కాని వారాంతానికి చికాకులకు గురి కావచ్చును వ్యాపారం భారీ ఎత్తున చేయడంవలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో, ఇదివరకు ఏర్పడిన అవరోధాలు తొలగిపోతాయి వృత్తిలో మీరు కొన్ని మొగమాటలకు లొంగిపోవడంవలన అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుబడి పోగల ప్రమాదం ఉంది సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగానే ఉంటాయి. శుభ కార్యాల విషయంలో మీ ఆలోచనలకు తగిన సంఘటనలు జరుగుతాయి.

**కుంభం :** గడచిన వారంకంటే ఈవారం బాగా ఉంటుంది వృత్తివ్యాపారాల్లో ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు పూర్తిచేయడంవలన ఆదాయం పెరుగుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలు జరిపి అధికారుల గౌరవాన్ని పొందగలరు ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. అలంకార వస్తువులు కొంటారు బంధువులకు సహాయం చేస్తారు

**మీనం :** వృత్తివ్యాపారాల్లో వారం ప్రారంభంలోనే చికాకులు కలగడంవలన వారాంతానికి కొంచెం అభివృద్ధిని సాధించినా, ఈవారం అంత సంతృప్తికరంగా కనిపించదు వ్యాపార రీత్యా చేసే ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది వృత్తిలో క్రమాభివృద్ధిని సాధించగలరు ఉద్యోగంలో మీ మంచితనంవల్లనే అనవసరమైన శ్రమకు గురి కాగలరు రావలసిన డబ్బు సమయానికి అందుతుంది కోర్టు వ్యవహారాల్లో ప్రతికక్షులు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు కలగవచ్చును సాటివారిలో గౌరవం లభిస్తుంది ★

కాని సంతానానికి అనారోగ్యం చేస్తుంది. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి శుభ మూలంగా వ్యయం జరుగుతుంది విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు పారిశ్రామిక వేత్తలకు అనుకూలంగా ఉంటుంది.

# జన్మదినఫలం

## ఏప్రిల్-16

అప్పుడప్పుడు వృత్తి వ్యాపారాల్లో కొన్ని అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడవచ్చునుగాని మొత్తంమీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది వ్యాపారంలో మీకు కొంతమంది మిత్రుల సహాయం లభించడంవలన తగిన అభివృద్ధిని సాధించగలరు వృత్తిలో నూతనావకాశాలు లభించగల సూచనలు ఉన్నాయి ఏదో ఒకవిధంగా డబ్బు సమయానికి అందుతుండడంవలన అన్ని వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటి కంటె బాగా ఉంటుంది ఆరోగ్యం బాగానే ఉంటుంది బంధువుల వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. వైద్యులకు యోగవంతమైన సమయం.

## ఏప్రిల్-17

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం బాగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు దీర్ఘకాలానికి ఫలితాల్ని ఇచ్చే భారీ వ్యవహారాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. సంవత్సరం మధ్యలో చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి వృత్తిలో సాటివారి పోటీని ఎదుర్కొని విజయాన్ని సాధించగలరు ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును. విలాస యాత్రలు చేస్తారు విద్యార్థులు కొంచెం శ్రమమీద మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## ఏప్రిల్-18

ఈ సంవత్సరం అన్ని విధాలా ప్రోత్సాహకరంగా ఉంటుంది వ్యాపారంలో మీరు ఇదివరకు ఎంత ప్రయత్నం చేసినా, నెరవేరని వ్యవహారాలు కూడా యిప్పుడు నెరవేరుతాయి కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో మధ్యవర్తిత్వంవంటి పాత్రను నిర్వహించగలరు వృత్తిలో ఆదాయంతోపాటు అంతస్తు కూడా పెరుగుతుంది ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం మీరుచేసే ప్రయత్నాలు సంవత్సరం మధ్యలో అనుకూలిస్తాయి ఆరోగ్యం బాగానే ఉంటుంది కుటుంబ వ్యవహారాలు మాత్రం బాగా ఉండవు సాహిత్య కళారంగాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు విద్యార్థులకు క్లాసు రాగల సూచనలు ఉన్నాయి రాజకీయ నాయకులకు మంచి సమయం.

## ఏప్రిల్-19

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది వృత్తి వ్యాపారాల్లో ప్రతి వ్యవహారమూ పూర్తి అయే వరకు ఎలాగ నెరవేరుతుందిదా? అనే ఆందోళన కలుగుతుంది కాని చివరకు అన్ని వ్యవహారాలూ మీకు అనుకూలంగానే ఉంటాయి వ్యాపార విస్తరణ ప్రయత్నాలు రాను రాను ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తి రీత్యా దూర ప్రయాణాలు చేస్తారు ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది స్థిరాస్తి వ్యవహారాల్లో మీకు చికాకులు వస్తాయి. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది.

## ఏప్రిల్-20

వృత్తి వ్యాపారాలు బాగానే ఉన్నా అప్పుడప్పుడు అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండదు. మీరు స్వంతంగాచేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు ఆశ కల్పించి మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. ఉద్యోగంలో అధికారులు మీపట్ల అనుకూలంగానే ఉంటారుకాని సాటివారితో భేదాభిప్రాయాలు వస్తాయి సాంఘిక వ్యవహారాల్లో మెప్పుకు రాని బాధ్యతను వహిస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## ఏప్రిల్-21

ఈ సంవత్సరం మొత్తంమీద బాగానే ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కాగల సూచనలు ఉన్నాయి రావలసిన డబ్బుమీద ఆధారపడి భారీ వ్యవహారాలకు పూనుకోవడం తగదు సాహసముతో కూడిన వ్యవహారాలు సంవత్సరాంతంలో లాభిస్తాయి వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది ఉద్యోగంలో ఇతరులు చేసిన తప్పులకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది సంవత్సరాంతంలో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆరోగ్యం బాగానే ఉన్నా, మానసికాందోళన కలుగుతుంది బంధువుల వ్యవహారాల్లో చికాకులు వస్తాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

## ఏప్రిల్-22

ఈ సంవత్సరం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు అవస్థమీది అనుభవం మరొకరిది కాగల పరిస్థితి ఏర్పడుతుంది మొత్తంమీద సంవత్సరంలో మొదటిభాగంకంటే రెండవ భాగం అనుకూలంగా ఉంటుంది నూతన వ్యాపారాల్లో శ్రమకు తగిన ప్రతిఫలం ఉండదు వృత్తిలో కొత్తవారితో పోటీ ఏర్పడుతుంది ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడవచ్చును అన్ని వ్యవహారాల్లోను సమయానికి కొంతమంది మిత్రులు సహాయపడగల సూచనలు ఉన్నాయి ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది విద్యార్థులు మొదటినుంచీ శ్రద్ధగా చదవడం మంచిది. ★



# సైతానులు వేదాలు వల్లించాయి

మధ్యాహ్నం మూడుగంటలు దాటాక రెండు ంటలసేపు నిద్రపోయిలేచి, స్నానంచేసి, బట్టలు సేసుకుని, దువ్వుకుని తల తడి ఆరకమునుపే ఆయనకి అది' కావాలి ఒక దాది లాగా పోషిస్తూవస్తున్న ఆర్డర్లీ' అప్పుకుట్టన్‌కి మాత్రమే 'అది' అన్నది మద్యం' మాత్రం కాదని తెలుసు మిగిలిన వారికి శెలిసినదంతా మధుసూదనరావు ఒక్క త్రాగు కోతన్నది మాత్రమే!

బంగళాలో మేడ మీది వీధివేపుకున్న డాబాలో తెల్లటి గుడ్డ పరచిన ఆ గుండ్రపు బల్ల చుట్టూ మూడు కుర్చీలు వేయబడి ఉంటాయి కానీ ఆయన కూర్చున్న కుర్చీ తప్ప మిగతారెండూ ఖాళీగావే ఉంటాయి. కానీ వాటిని వేసి వుంచి తీరాలని అప్పుకుట్టన్‌కో ఎరుగును

ఆ బల్ల మీద సీలు విడగొట్టని మద్యపు బుడ్డి, పైన విశాలంగా వుండి క్రింద సన్నంగా మట్టు గల్గినగాజు సారాయిగిన్నె, ప్రక్కని ఆయ నకని ప్రత్యేకంగా తయారు చేయబడ్డ ఉర యూరు చుట్టలున్న పెట్టె— వీటికెదురుగా సెలెక్టు చేసి తీసుకుని వచ్చి పైకవర్లతోసహా వున్న పాశ్చాత్య సంగీత రికార్డుల దొంతర పెట్టబడి ఉంటాయి

"యూడికులోన్" పరిమళం వస్తుంటే, లోపలి గది ఒకదాంటోంచి ఆయన బయటికి వచ్చి మేడ మీద డాబా చేరేసరికి అక్కడున్న ఒంటి 'డోవ్' లైటు' ఆయన్ని ఆహ్వానిస్తున్నట్లు వెలుగుతుంది ఆ సంఘటనని అంగీకరిస్తున్నట్లు కొంచెం నిలి 'ఊఁవ్ '! అన్న ముక్కతో తలాడించి ఏదో ఒక తృప్తితో బల్ల దగ్గరగా ఉన్న మూడు కుర్చీలలో ఒకదాంట్లో— భవంతిగేటుకి ఎదురు గుండా వేసిన కుర్చీలో కూర్చున్నారాయన ఎప్పుడూ ఆయన అటుకేసే కూర్చోవటం అలవాటు అక్కడనుంచిచూస్తే గేటుదగ్గర ఆయుధపాణియై 'సెంట్రీ' నిలుచున్న కాపలా వాడినీ, తన చూడవచ్చే వారినేగాక — వెన్నెల రాత్రులల చంద్రోదయాన్ని కూడా చూడడానికి వీలవుతుంది

ఆయన కూర్చోగానే స్విచ్చిబోర్డు దగ్గర నిలుచున్న అప్పుకుట్టన్ 'టప్‌టప్' మని మిగతా స్విచ్చీలనీ వేసాడు. భవంతి ఆవరణలో అక్కడక్కడ లేకాంతులని విరజిమ్మే లైట్లు వెలిగి, ఆ ప్రదేశం పూర్తిగా ఒక స్వప్నలోకంగా కన్పిస్తుంది.

ఇది శరత్కాలంకాదు. కానీ వెన్నెల కాలంలో ఆయన కోరిక ఏమిటో అప్పుకుట్టన్ తెలుసుకునే యున్నాడు.

మరుక్షణం ఆయన ఆజ్ఞకోసరం ఆయన ప్రక్కన వచ్చి నిలుచున్నాడు.

బల్లమీద దొంతరగా పెట్టిన రికార్డులని తీసి ఒక్కోదాన్ని వెలుగులో చూసి, అప్పుడున్న తన మానసిక స్థితికి తగినట్లు, 'దీని తర్వాత ఇది' అని ఒక క్రమంగా పేర్చి పెట్టారాయన. అవని ముగిసాక వాడివి చూసి మెల్లగా చిరునవ్వు నవ్వారు.

మధుసూదనరావుకి నవ్వడం వచ్చని తెలుసుకో డానికి ఈసమయం మాత్రమే సాక్షి.

ఆ చిరునగవు పారితోషికానికి కృతజ్ఞత తెల్పు తూ 'ఎస్, సర్!' అని ఒక సెల్యూటు కొట్టి ఆ రికా ర్డుల దొంతరని చేతులో తీసుకుని హాలులోకి— 'రేడియో గ్రాము' వున్న చోటుకేసి వాడు వెళ్ళాడు.

తిరిగి ఒక దగ్గు దగ్గి పెద్ద— నెరిసిన మీసాలని సరిచేసుకుని, చుట్టలపెట్టని తెరచారు. ఒక చుట్టని తీసి లేబిలుని చింపి పారేసి ముక్కు దగ్గర పెట్టు కుని వాసనచూసి దాని ఒక కొసని ముందర పళ్ళతో కొరికి ఆ ముక్కని నమిలి, కొంచెం సేప య్యాక ఉమ్మేసారు. అంతట్లోగా అప్పుకుట్టన్ తిరిగొచ్చి బాటిలు తెరచి గిన్నెని నింపి పెట్టాడు.

అప్పుడు ప్రారంభమయింది గానం. తిరిగి ఆయన ముఖాన్న ఒక చిరునగవుతో మద్యాన్ని సేవిస్తారు.

ఆయనకి త్రాగడానికి లైసెన్సు ఉన్నందు వలననూ, పదే పదే రేసులకి వెళ్తారు. అందు వలననూ, అనుమతించబడిన పనులనే చేస్తారని అర్థంకాదు. రిటైర్డు అయ్యే వయసున్నా కూడా ఆయన వేషభాషలూ నడవడికా అన్నీ ఒక చిన్న వయస్సు వీటునికి ఉండాల్సినవే అని ఊర్లోని జనా భిప్రాయం...............

కాని ఆయనో దీన్ని గూర్చి బెంగ లేనివారు. ఆయన్ని ఎవరేం చేయగలరు?.......... ఆయన అధికారి— అధికారమూ బాధ్యతా కల్గిన శక్తివంత మైన ఒక శాఖకి అధికారి. నూరు మైళ్ళ విస్తీ ర్ణమున్న జిల్లాకంతకీ ఈయనే ఏక చక్రాధిపతి. ఆ పదవికి ఎంత కఠినత్వం, జాగరూకత ఉండాలో అంత కఠినత్వం, జాగరూకతా కలవారే......... ఆయన స్వంత జీవితంలో ఎలాగుంటే ఏం? కానీ ఆయన కఠినత్వం—మృగతనమనే అందరూ అను కున్నారు. ఆయన మీద ఎవరికి మంచి అభి ప్రాయం లేక పోవడానికి కారణాలున్నాయి. ఆయన ఎవరినుంచీ మంచి మర్యాదా ఎదురు చూళ్ళేదు. అందరూ తనదగ్గర భయపడి అణిగిమణిగి నడుచు కోవాలనే ఆశపడ్డారు. వారూ అలాగే నడుచు కున్నారు. ఆయనా వారినల్లా నడిపించ చూసినదీ అంతే! ఆయనెలాగ ఉంటే ఎవరికేమిటి? ఆ శాఖకి ఆయన పేరంటే ఒక హెచ్చరిక, ఆయన దర్శనం ఒక వణుకు!

ఈసందర్భం తప్పించి వేరే సమయాలలో ఆయన ముఖంలో ఒక చిరునవ్వు ఏ మనిషి చూడ నేరడు.

అప్పుడు లోపల హాలులోంచి అలలు అలలుగా లేచి వచ్చిన సంగీతనాదం— హృదయకమలంలో పొడయి మొద్దెక్కిన భాగాన్ని, మొన దేలిన గోరుతో మెల్లగా గోకి కరగదీసినట్లు ఆయన దేహాన్ని పులకింప చేసింది. కళ్ళు మెరిసాయి.

ఆయనా మానవుడే అవడానికి ఈ సందర్భం మాత్రమే ఇంకోసాక్షి............

ఆ సంగీతంలో ఒక పల్లవికీ - మరో పల్లవికీ ఉండే నిశబ్దాన్ని - ఆ మౌన సంగీతపు— సంపూర్ణ త్వాన్నిభరించ నేరక అంతరంగాన్ని గిలిగింతానా భూతికి వశమయి హోరువిప్పి గలగలా నవ్వుతారే— ఇప్పుడు ఆయన ఒక పసిపాప!

ఈ సమయాన్నే 'ముహూర్త వేళ'గా తలచి, దీని రహస్యం తెలిసిన కొందరు పెద్ద మను ష్యులు మధుసూదనరావుని చూడ్డానికి వస్తారు. ఆయన కూడా ఎవరు చూడ్డానికి వచ్చినా ''రమ్మని చెప్పు'' అని అనుజ్ఞ ఇచ్చేస్తారు. వచ్చేవారిలో చాలా భాగం లారీలు, బస్సులు, స్వంతదారులు, పెద్ద వ్యాపారులు, యజమానులు— ఈరకం గానే ఉంటారు.

ఆయనవల్ల వారికీ, వారి మూలంగా ఆయ నకీ పరస్పర సహకారం, లాభం లభిస్తాయి.

నెల నెలా 'మామూళ్ళ'ని ధన రూపంగానూ, వస్తు రూపేణానూ ఆయన బహుమతులని మ్రొక్కుబడి తీర్చేటట్లు ఇవ్వడానికి వస్తారు.

అవును. ప్రజల భాషలో దాని పేరు లంచమే! లేకపోతే ఎలాగ ఇలాంటి సుఖ జీవితం గడ పడం ఆయనకి వీలవుతుంది?

వెయ్యి రూపాయలు సంపాదించే అధికారిగా ఉన్నానరే— ...... ఇద్దరబ్బాయిలను కాలేజీలో చదివిస్తున్నారే! భార్యపోయిన ఇరవై సంవత్సరాలుగా వారిని హాస్టళ్ళలోనేకదా పెంచారు ...... ఎంత పర్మిటున్నానూ దానికిమించి ఎన్నో రెట్లు త్రాగు తున్నారే......ఆయన మద్యపు ఖర్చే వెయ్యి లెక్కన అవుతుందే!.....

లంచం తీసుకోకుండా వీలవుతుందా?..... మధుసూదనరావు లంచం తీసుకోనేవారేనా. త్రాగు బోతేనా. నడత చెడిన వారేనా. జూదమాడే వారేనా.

కానీ, ఆయన డిపార్టుమెంటులో ఆయన క్రింద ఉండే ఎవరూ లంచం తీసుకోవడమో, శాఖ గౌరవానికి భంగం కల్గించేవిధంగా నడచుకోవ డమో ఆయన అంగీకరించరు.

మధుసూదనరావు పదే పదే చెప్పుకుంటారు. ''నేను అవినీతికి విరోధిని'' అని.

**తమిళ మూలం**

## జయకాంతన్

**అనువాదం**

## విశాఖ

అవిధంగా చెప్పుకున్నప్పుడల్లా ఆయన మనస్సు లోని ఒక కంఠం — ఎదుటి మనస్సు ప్రతి ధ్వని లాగా శాంతంగా గొణుగుతుంది. ''సైతానూ వేదాలు వల్లిస్తున్నాడు!''

ఏది ఎలాగున్నానూ ఒక్కటిమాత్రం యదార్థం; నిజం. అన్ని విధాలైన చెడ్డ పేరులకీ తను లోనయి ననూ తన శాఖలోని ఒక్క ఉద్యోగి కూడా ఒక చిన్న అపవాదుకు లోనవకుండా మధుసూదనరావు స్ట్రిక్టు నెస్— క్రమశిక్షణ వారిని కాపాడుతూ వస్తోందన టానికి సందేహంలేదు.

''సార్'' అని నోటిలో గొణుగుతూ అప్పు కుట్టన్ ఆయనకి ఎదురుగావచ్చి నిలిచాడు.

మధుసూదనరావు కళ్ళని మూసుకుని చేతి లోనిది త్రాగడం కూడ మర్చియున్నారు. దూరాన్న సంగీతం మౌనంలో జనించి, మాయలాగా వ్యాపించి వికసించి తనలోకి జొచ్చి ప్రతి ధ్వని మీటు తున్నట్లు—తిరిగి తిరిగి విప్పించే ఒకే పల్లవి య్యైన—ఆ వయిలెన్ల నాదంలో తనని అర్పించు కున్న ఆయన చూపులు కొంతక్రితం కాంపౌండు గేటులో కాంతులు వెదజిమ్ముతూజొచ్చిన ఆకారుని గాంచాయి. ఇప్పుడు అప్పుకుట్టన్‌వచ్చి ఎదురుగా నిలుచున్నాడు...... అంతా అతనికి తెలిసే ఉంది. కానీ ఆ నాదయోగోపాసనని భంగం చేయ డానికి ఇష్టంలేక అలాగే స్థాణువైపోయారాయన.

ఆయన్ని కదపకూడదన్న దృష్టితో అప్పుకుట్టన్ కూడా కొంచెంసేపు మౌనంగా నిలుచున్నాడు. ఆయన తన కెంజాయదృక్కులతో నగంకన్ను తెరచి వాడిని చూసారు.

చేతి సైగతో ''రమ్మని చెప్పు'' అని చూపించి కళ్ళని మూసుకుని చేతిలోనిది త్రాగుతూ సంగీ తంలో లీనమయ్యారు.

ఇప్పుడు అప్పుకుట్టన్ నిలుచున్న చోట్లోనే వేళ్ళకి రవ్వల ఉంగరాలు ప్రకాశిస్తూ, మస్లిను పంచె, సిల్కు జుబ్బా వేసుకున్న ఒక పెద్దమనిషి నిలుచున్నారు.

సంగీతంలో లీనమయిన మధుసూదనరావు మూసిన రెప్పల కొలికిల్లో కన్నీరు మెరసింది.

......ఆయన కళ్ళు తెరచినప్పుడు ఎదురుగా నిలుచున్నాయనని చూసి కళ్ళని చిట్లించి నవ్వుతూ చెప్పారు: ''ఈ సంగీతం ఉందే ఇది, జడునికీ ప్రాణం పోస్తుంది. ప్రాణంలో ఆత్మని లీనం చేస్తుంది. ఆత్మలో..........వో! మీరు సినలైన బిజినెస్‌మేనే.......మీ కెందుకీ ఆత్మని గూర్చిన బెంగ!'' అని చెప్పి నవ్వారు మధుసూదనరావు. వచ్చి నతనికి ఇతను చెప్పిందేమీ అర్థంగాకపోయినా ''ఇహి ఇహి ఇహి'' అని చేతులు నలుపుకుంటూ నిలుచున్నారు.

మధుసూదనరావు ఎవరినీ ఎప్పుడూ కూర్చో మని చెప్పరు. ఎవరూ కూడా కూర్చోరు. ఇతను మామూలుగా వచ్చే మనిషే. ఈ సమయాన్ని ఎలాగ ఉపయోగించుకోవాలన్నది ఈతనికి తెలు సును.

''అయ్యగారు ఒక వారంగా వూర్లో లేరు'' అని చెప్పి దేనికో నాంది పలికారు బిజినెస్‌మేన్.

''అవును......'' అని చెప్పి కొంచెం నిదా నంగా ఆలోచించి ''బెంగుళూరు రేసులకి వెళ్ళాను'' అని చెప్తూతూన్నప్పుడు, అతని చెవులలో వందెవ్వు

సూత్రాలు తిరిగేస్తూ శబ్దం వినిపిస్తున్నట్లు..... ఆయన కళ్ళకి మొదటిదిగా పరిగెత్తివచ్చి 'విన్నింగ్ పాయింటు' దగ్గర నాల్గోదిగా మారిన 'గోల్డెన్ హెరాల్డ్'ని చూసి ప్రేమతో సానుభూతిచూపేటట్లు భ్రాంతి......

"ఓహో!........ఇట్ ఈజ్ ఆల్‌రైట్...... రేసు అంటే అంతే!......" తన ముఖానికి ఎదురుగా చేయిని ఆడించి తన ఆలోచనలకి అంతరాయం కల్గించుకున్నారు.

"ఏం!.......నేను లేనప్పుడు మీరు నాకోసం వచ్చారా?" అన్నారు మధుసూధనరావు.

"అవునుసార్! ఆ లైసెన్సు విషయంగా.....

# సైతాను...

రావు కొంచెంసేపు కళ్ళని మూసుకుని ఆలోచించారు. ఆయన ముఖం ఆలోచనలతో నల్లబడింది. నుదుటిని ముడతలు పడేటట్లుగా చేసి, "ఆఫీసులో వచ్చి చూడమను" అన్నారు.

అప్పుడు సావిట్లోంచి విన్పిస్తున్న సంగీతంలో ఒక ఒంటి వయొలెను అపశృతితో ఏడుస్తోంది!

అప్పుకుట్టన్ వచ్చిన మనిషిని త్రిప్పి పంపేయడానికి మేడ మెట్లు దిగుతుంటే అతని పెద్ద గొంతుక వెనుకనుంచి వినపడింది : "అప్పా!..."

ఊటుంటే అతని ముఖం నిశితంగా పరీక్షించారు.

"ఊఁ. అలాగైతే నువ్వు ఎందు కిక్కడకి ఇప్పుడు వచ్చినట్టు?" అని తన చూపులు అతడి ముఖంలో వాడిగా గుచ్చుకునేటట్లు అడిగారు. అతడికే ఎందుకు వచ్చాడో అని అర్థం కాలేదా? ఒక్క నిముషం మౌనంగా పిచ్చి చూపులతో నిలుచున్నాడు. అతడి కళ్ళు చెమ్మగిల్లాయి. హృదయంలోని దుఃఖాన్ని నొక్కి మింగేటప్పుడు కంఠం ముడి 'టక్కు'మని కదిలింది. దీనస్వరంతో చెప్పాడు.

"సార్......నేను లంచం తీసుకున్నాను! ధనాశ

వల్ల కొన్ని నిముషాలు తలయెత్త సాధ్యంలేదు. అప్పుడు ఆయన వెనుకనుంచి, ఇంతవరకూ మెల్లగా విన్పించుతున్న సంగీతంలో కూడా ఒక దుఃఖపు రేఖ పొడసూపింది

ఒక దీర్ఘ శ్వాసతో తలెత్తారు రావు. అప్పుడు జోసెఫ్ ముఖాన్ని తుడుచుకుంటున్నాడు.

"జోసెఫ్, ఇలా కూర్చో ఫర్వాలేదు ...." అని తన కెదురుగా ఉన్న కుర్చీలలో ఒకదాన్ని చూపించి దయ నిండిన స్వరంతో చెప్పారు రావు

"వద్దు సార్ ... ఇలాగే . " అని కొంచెం వెనక్కి వెళ్లి నిలుచున్నాడు జోసెఫ్

"ఎన్నేళ్లూ పిల్లవాడికి ?" బొంగురు గొంతుకతో అడిగారు రావు.

"ఆరేళ్లు సార్ !"

"ఏం జబ్బు ?"

"డిఫ్తీరియా ... గవర్నమెంటు ఆస్పత్రికి తీసుకెళ్లాను . చాలా ఖరీదైన ఇంజక్షనులు వేరే ఒక కేసుకి వాడినందున చేతిలో లేవన్నారు. ప్రైవేటు డాక్టరు దగ్గరికి తీసుకెళ్లి, వెంటనే ఇప్పించాలని చెప్పారు. నా చేతిలో ఒక్క కానీ కూడా లేదు ఓహ్ . కేవలం ఒక గుమాస్తా పిల్లవాడికి రాకూడని రోగమని నేను అప్పుడాలోచించడానికి వేళలేదు ఎక్కడెక్కడో చూసాను ఇప్పుడు నేను లంచం తీసుకున్నానని సాక్ష్యం ఇవ్వడానికి వచ్చిన అందరి దగ్గరా అడిగాను నా దగ్గిర లేదు అవును ! వాళ్ళేం లంచం తీసుకుంటున్నారు గనుకనా ? నాకో వంద రూపాయలు విసిరివేయడానికి ? అప్పుడే ఆయన దగ్గర మొండిగా పట్టుబట్టి—ఒక తప్పుపని—రేపు పని కూడా పోగలదని తెలిసీ—అన్నింటికీ సిద్ధపడి ఆ వంద రూపాయలూ పుచ్చుకున్నాను. అప్పటికీ ఆ కరుణగల భగవంతుడు, 'లంచం తీసుకున్నవాడి కొడుకుగా' ఉండకూడదని "

అతడు చెప్పి ముగించలేదు

"నో . నో . అలాగ చెప్పకు" అని ఆపారు రావు "జోసెఫ్" అని పిల్చి కాస్సేపు మౌనంగా ఉన్నారు ఆ మౌనంగా ఉన్న కాలంలో, తాను త్రాగుబోతుగా మారని రోజుల్లో, న్యాయంగా క్లాస్ త్రీ ఆఫీసరుగా ఉన్నప్పుడు, తనతో జీవించిన ప్రియభార్యని గూర్చి ఎందుకో తల్చుకున్నారు ఆమెని పోగొట్టుకున్న విచారంలో—తనో త్రాగుబోతుగా, స్త్రీలోలుడుగా, లంచగొండిభూతుడుగా మారిన తర్వాత తనకి దూరంగా పెరుగుతున్న ఇద్దరు కొడుకుల్నీ గూర్చి ఆలోచించారు తర్వాత ఒక పెద్ద దగ్గుతో తనని సర్దుకున్నారు "జోసెఫ్ నీకు కల్గిన కష్టానికి నేను విచారిస్తున్నాను" అని ఆంగ్లంలో చెప్పి తిరిగి మాట్లాడారు "నిన్ను నేను మెచ్చుకుంటున్నాను అందువల్లే 'ఇంక నేను సర్వీసులో ఉన్నా నేను లంచం తీసుకోను' అని చెప్పావే—దాన్ని పూర్తిగా నమ్ముతున్నాను . ఊఁ' అని తమ బొంగురు గొంతుకతో హెచ్చు స్థాయిలో ప్రకటించారు రావు జోసెఫ్‌కి ఇప్పుడు చెయ్యీ, కాలూ వణకనారంభించాయి

మధుసూధనరావు తన బల్లమీదున్న కవరుని కొంచెంసేపు తదేకంగా చూసారు. తర్వాత విరక్తి నవ్వుతో చెప్పారు.

"నేనుకూడా నీలాగ లంచాన్ని—అవినీతిని—ద్వేషించినవాడినే. ఇంకా ఇప్పుడు కూడా నేను లంచానికి విరోధి నేను" అని చెప్పి "నేను ఇలాగ చెప్పుతుంటే ఏమిటిది ? సైతానూ వేదాలు వల్లిస్తోందే' అని నీకు అన్పిస్తోంది కదూ" అని అడిగారు. వెంటనే తను అలాగ చెప్పిఉండకూడదని తలుచుకున్నారు.

జోసెఫ్ జవాబు చెప్పనేరక మౌనంగా ఉండిపోయాడు.

ఆయన ఆరిపోయిన చుట్టని వెలిగిస్తూ మళ్ళీ చెప్పారు.

"సాధారణంగా ఎవరూ లంచం తీసుకోవాలన్న ఆశతో, అవినీతిని పెంచాలన్న ఆశతో, తీసుకోవడంలేదు.. ఒక్క అవసరానికే తీసుకోవచ్చు కానీ అందరికీ నీలాగ దాన్నిఒప్పుకునే ధైర్యమో, ఇంక మీదట చెయ్యను అని నిర్ణయించుకునే సాహసమో ఉండదు" అని చెప్పి ఆయన కొన్ని నిముషాలు మౌనంగా ఆలోచించారు. అవును తనని గూర్చే ఆలోచించారు

హఠాత్తుగా ఒక దీర్ఘ శ్వాసతో మౌనాన్ని చీలుస్తూ, "ఊఁ అవసరం అని అనుకుంటే దానికో హద్దుందా ? అందుకే కదా ఈ డిపార్టుమెంటులో నా క్రింద ఉన్నవారిని కఠినంగా దండిస్తున్నాను. నన్ను గూర్చి నువ్వు ఎన్నో విని ఉండొచ్చు కానీ . మిమ్మల్నంతా అలాంటి పని చెయ్యడానికి అనుమతి ఇవ్వను ..." అని ఆయన ఆక్రోశంతో—చుట్ట పెట్టుకున్న తన చేతిని జోసెఫ్‌కేసి చాపి అరిచారు" నావల్ల దాన్ని సహించే సాధ్యంగాదు."

హఠాత్తుగా ఆయన శాంతించారు. కొంచెం మద్యం సేవించారు శాంతమైన స్వరంతో బలమైన ఆలోచన నిండిన కళ్లతో జోసెఫ్‌ని గట్టిగా చూసి తిరిగి చెప్పసాగా రాయన.

"ఏదో ఒక అవసరానికే ఎవడో ఒకడు లంచం తీసుకున్నానూ, అవినీతి ప్రబలడానికి కారణం—అవసరంవల్ల కాదు, అది ఒక్క అలవాటు వల్లే! అన్నీ—అవును, అన్నీ ఒక విధమైన అలవాట్లే! ఇదుగో నేను చుట్ట కాలుస్తున్నానే, బ్రాందీ త్రాగుతున్నానే .. ఇవన్నీ అలవాట్లే. ఏదైనా ఒకటి అలవాటయితే, దానిలోంచి తప్పించుకోవటం... ఓ ! జరగదు చాలా కష్టం ! నాకు కష్టముల్నందున నేను చేసేవన్నీ రైటే అని అనుకోవడమా ? తర్వాత నా పిల్లలు బాగుపడతారా ? .... నేను ఎందుకోసరం నా పిల్లల్ని నా దగ్గర్నుంచి వేరు చేసాను ? .. నన్ను చూసి వాళ్లు చెడిపోకూడదనేగా . నా కథ యింకా కొన్నాళ్లవరకేను. నేను రిటైరు అయిపోతాను నాతోబాటే అలవాట్లన్నీ రిటైరయిపోనీయి .. మీరంతా ఇంకా చాలా రోజులు జీవించేవారు అందువల్లే మీరు తప్పు చేస్తే నేను ఒప్పుకోను అంటున్నాను" అని చెప్పి గంభీరంగా లేచి నిలుచున్నారు

ఆయన హృదయాన్ని కదల్చే సంగీతం—ఒక



## సైతాను...

క్రింది స్థాయి వయిలెను హెచ్చుస్థాయి వయిలెనూ తర్కిస్తున్నట్లు—వినిపిస్తోంది

జోసెఫ్ వెళ్లడానికి సెల్యూట్ కొట్టి నిలుచున్నాడు—దాన్ని గమనించని మధుసూదనరావు ఆకాశాన్ని చూస్తూ చెప్పుకుపోయారు "సైతానూ వేదాలు వల్లించనీ అందుమూలంగా క్రొత్త సైతాన్లు జన్మించకుండా ఉంటుందికదా ? . " అని తనలో నవ్వుకున్నారు.

"అలాగయితే నే వెళ్లనా సార్ ?" అని తిరిగి ఒకసారి సెల్యూట్ కొట్టి నిలిచాడు జోసెఫ్.

"ఊఁ ! " అని ఎక్కడో చూస్తూ అనుజ్ఞ యిచ్చిన రావు హఠాత్తుగా తిరిగి "ఉండు" అని చెప్పి బల్లమీదున్న కవరుని తీసారు. ఒక్క క్షణం ఒక చిరునవ్వుతో దాన్ని చూసి అందులోంచి ఒక వంద రూపాయల నోటుని తానే తీసి అతడి దగ్గర చాపుతూ చెప్పారు

"నువ్వు లంచం తీసుకోలేదు అప్పే తీసుకున్నావు అతనికి రేపే ఇచ్చెయ్యి నువ్వు వెళ్లొచ్చు !"

చేతులు వణుకుతుంటే దాన్ని తీసుకుని కళ్ళు చెమరుస్తూంటే అతడు వీడ్కోలు తీసుకున్నాడు.

అతడు వెళ్లేటప్పుడు ఆయన తన కోసరం తనతో చెప్పుకున్నారు

"భగవంతుడా ! నేను నా క్రిందివారిని క్షమిస్తాను నువ్వు నన్ను క్షమించు !"

మధుసూధనరావు అతడి వీపుని చూస్తూ లేచి నిలిచారు హాలులోంచి గట్టిగా వస్తున్న సంగీత ప్రవాహం పొంగి, ఒంటి వయిలెన్ల నాదం ఆయన హృదయాన్ని జొచ్చి ఆయన ఆత్మతో ఏకాంతంగా సంభాషించింది

హఠాత్తుగా అనేక వయిలెన్లు ఒక్కసారి ఉవ్వెత్తున లేచి సంగీతం పెద్దదయి గట్టిగా మ్రోగి వాల్గుసార్లు ఏదో వాయించి ఆగిపోయాయి.

మర్నాడు మధుసూధనరావు, ఆఫీసు గదిలోంచి సంతకంచేసి ఇచ్చిన ఫైలు మధ్య ఉన్న జోసెఫ్ 'పర్సనల్ ఫైలు' తీసి విప్పి చూసారు, హెడ్ క్లార్కు రామభద్రం

అందులో 'ఈ శాఖలో పనిచేసేవారందరిలోనూ చాలా నిజాయితీ కలవాడు' అని వ్రాసిన ముక్కల్ని చూడగానే అతని ముఖం ఆశ్చర్యంతోనూ, ఒకవిధమైన నిరాశతోనూ నల్లబడింది

"ఇది ఒక త్రాగుబోతు వాగుడు" అని తలచుకుని తల యెత్తారు రామభద్రం.

అప్పుడు మధుసూధనరావు త్రాగి ఉండలేదనడానికి సాక్ష్యం—అదుగో—నవ్వడం తెలిని మనిషిగా శిలలాంటి ముఖంలో, ఎవరినీ లక్ష్యపెట్టకుండా అహంకార మే రూపుగా ఆఫీసుగదిలోంచి బయటికివచ్చి కారుకేసి వెళ్తున్న ఆయన మామూలు నడకే . !

ఆయన కారెక్కి వెళ్లాక కూడా ఆ దిక్కుకేసే చూస్తూ నిలబడ్డారు రామభద్రం, ఒకమూల బల్ల దగ్గరున్న జోసెఫ్

ఇద్దరూ ఆయన్ని చూసారు. రెండు వేర్వేరు కోణాలనుంచి. ★




# వైజ్ఞానిక గాథాశతి

## — 14 —

డాక్టర్

**1892** వ సంవత్సరము సెప్టెంబరు 29వ తేదీ 'నేచరు' వారపత్రికలో లార్డు రాలే పంపిన ఉత్తరము పడింది "ఆర్యా! నేనీ మధ్య నడిపిన ప్రయోగాలలో వింత ఫలితాలు బయటపడ్డాయి గాలిలోంచి విడదీసిన నత్రజనివాయువు 2 3102 గ్రాముల బరువు వచ్చింది అంతే నత్రజని వాయువు రసాయనపదార్థాలు వెచ్చబెట్టి తయారు చేసినట్టిది అవే పరిస్థితులలో 2 2990 గ్రాముల బరువు వచ్చింది అదే వాయువు, అంతే వాయువు రెండు పద్ధతులవల్ల తయారుచేస్తే బరువు తేడా ఎందుకు రావాలో తెలియలేదు మీ చదువరులలో రసాయనికులెవరేనా ఈ విషయంలో ఏమేనా సలహాలిస్తే కృతజ్ఞుడను" అని.

గాలిలో అక్సిజను ఉన్నదనీ, అది వస్తువులు మండడానికి సాయపడుతుందనీ అందరికీ తెలుసు మానె వత్తి చిన్నది వెలిగించి, దానిమీద వెడల్పు మూతిగల సీసాని బోర్లిస్తే, ఆ వత్తి కొంచెంసేపు మండి ఆరిపోతుంది. వత్తి ఆరిపోయేసరికి గాజు సీసాలోని గాలి అంతా కర్చైపోదు ఒక వంతు కర్చై నాలుగు వంతులు మిగిలిపోతుంది కర్చైనది ఆక్సిజను, మిగిలిపోయినది నత్రజని అన్నారు మిగిలిపోయిన నత్రజనిలో—గ్యాసులైటు తీగ అంటారూ ఆ మెగ్నీసియము తీగ మండుతునే ఉంటుంది వెలిగించి ప్రవేశ పెట్టితే అంటే మెగ్నీసియము నత్రజనితో రాసాయనిక సంయోగము పొందుతుందన్నమాట ఇది నత్రజని వాయువు గుణము

అమ్మోనియం నైట్రైటు అన్న రసాయనిక పదార్థమును చిన్న గాజు గొట్టములో వెచ్చబెట్టితే నత్రజని వస్తుంది ఇది రసాయనిక పదార్థంలోనుంచి తీసిన నత్రజని వాయువు ఇందాకటిది గాలిలోంచి తీసినట్టిది "రెండు పద్ధతులలోనూ తయారయ్యేది నత్రజని వాయువే అయిఉండగా, సరికి సరా తీసుకుంటే గాలిలోంచి తయారైన నత్రజని బరువు ఎక్కువుండేందుకు?" అన్నది లార్డు రాలే సందేహము ఈ తేడా ఎప్పుడో ఒకసారి వచ్చిన దేమికాదు. ఈ సందేహాన్ని ప్రచురించే ముందు లార్డు రాలే చాలామార్లు సోదా చూచి, తేడా నిర్ధారణ అయిన తర్వాతనే ప్రచురించాడు.

1785 లో కేవెండిషు నైట్రోజనూ ఆక్సిజనూ మిశ్రమాన్ని విద్యుత్ చెణుకువల్ల సంయోగించేటట్లు చేశాడు ఈ రీతిగా ఏర్పడిన నైట్రసు ఆమ్ల వాయువు పొటాసియము హైడ్రాక్సైడు ద్రావణములో కరిగిపోయింది. అయితే మొత్తానికి చిన్న బుడగ మిగిలిపోయిందన్నాడు కేవెండిషు.

ఆ మిగిలిపోయిన బుడగ నైట్రోజను కాదని కేవెండిషు నిరూపించలేదు. లార్డు రాలే ఆ ప్రయోగమును మళ్లీచేసి, మిగిలిపోయిన గాలి బుడగను విద్యుత్ప్రసారముతో వెలిగేటట్లు చేసి ఆ వెలుగు నత్రజని వెలుగు కాదని కనుక్కున్నాడు అంటే ఏమన్నమాటా? గాలిలోని ఆక్సిజనును రసాయనిక పద్ధతులవల్ల తీశేస్తే మిగిలిఉండే వాయువు నత్రజని మాత్రమేకాదు చాలా కొంచెమైనా, నత్రజనికి భిన్న ధర్మాలు గలిగిన ఇంకొక వాయువు గాలిలోని నత్రజనితో కలిసి ఉన్నదన్నమాట. ఆ వాయువు—సరికి సరా తీసుకుంటే నైట్రోజనుకంటె బరువైనది కనుక గాలిలోంచి—ఆక్సిజనును తీసేసిన నత్రజని అసలు నత్రజని (రసాయనిక పదార్థంలోంచి తీసిన నత్రజని) కంటె బరువైంది. తేడా ఎంతో కొంచెమే అయినా లార్డు రాలే వంటి కచ్చిత రసాయనికుని తూకంలో దొరికిపోయింది. ఈ తేడా కొంచెమేకదా అని ఆయన అశ్రద్ధ చేసిఉంటే ఆ కొత్త వాయువును—గాలిలో ఉన్నట్టిదే అయినా పట్టడానికి మరికొంతకాలం పట్టి ఉండును. నిర్దుష్టపు కొలతల నైశిత్యమూ ఉపయోగమూ అలాటిది.

తరువాత ఆ కొత్త వాయువును గాలిలోంచి విడదీసి దాని ధర్మాలు పరిశీలించాడు లార్డు రాలే పెద్ద గాజు బుడ్డిలో 9 పరిమాణాలు గాలీ, 11 పరిమాణాలు ఆక్సిజనూ బిగించి, ఆ మిశ్రమము లోంచి విద్యుత్ చెణుకులు ధారాళంగా పంపుతూ పొటాసియము హైడ్రాక్సైడు ద్రావణముచేత నత్రజనీ ఆక్సిజనుల సంయోగమువల్ల ఏర్పడ్డ నైట్రస్ ఆమ్ల వాయువును పీల్పించాడు ఇది కేవెండిషు చేసిన ప్రయోగమే అయితే మిగిలిపోయిన వాయువు దాని గుణ పరిశీలనకు సరిపోయేటంత ఉన్నది. ఆ కొత్తవాయువును 'ఆర్గాను' అన్నారు అది ఆక్సిజనుతో కలవదని తెలిసిపోయింది హైడ్రోజను, క్లోరీను, ఫ్లోరీనులతోనూ ఈ కొత్తవాయువు కలవలేదు దేనితోనూ కలవని కారణము చేతనే లార్డు రాలే దానికి ఆర్గాను (బద్ధకపు వాయువు) అని పేరు పెట్టాడు

ఎలక్ట్రికు బల్బులలో టంగ్స్టను లోహపు తీగె చుట్టను వాడతారు వెలిగే వేడికి ఆ లోహము ఆవిరిఅయి బల్బులోపలివైపు నల్ల పూతగా అంటుకుని కాంతిని కొంత తగ్గిస్తుంది బల్బులో ఆర్గాను వాయువు నింపితే ఈ నలుపుతగ్గుతుంది. ★

వాడు

మధ్యాహ్నం భోంచేసి పడుకున్నాడు శాము. వీణ అతని కడుపుమీద కూర్చుని, అతని జుత్తు లాగుతూ, "నాన్నా నాన్నా" అని పలకరిస్తోంది మీర తమలపాకుల పళ్లెంతో కాళ్ళవేపు కూర్చుంది తమలపాకుల ఈనెల తీసి, సున్నంరాసి, చిలకలు చుట్టి, భర్త కందిస్తోంది శాము వాటిని నోటిలో వేసుకుంటూ,

"మన జాని పుట్టిన వేళ మంచిది" అని మీర వేపు వోరగా చూశాడు

మీరకు అర్థంకాలేదు.

"ఏం ?" అంది

"పెళ్లయినప్పటినుండి, ఒక్కరోజైనా, ఇలా చిలక చుట్టిచ్చి ఎరుగుదువా ? జాని పుణ్యమా అంటూ ఈ అదృష్టం పట్టింది, నాకు"

"మీ రెప్పుడైనా అడిగారా, పోని ?"

"అదీ అడగాలా ఏమిటి ?"

మీరకు పెళ్లయినప్పటినుండి ఒక్కరోజైనా భర్తకు తమలపాకులకు సున్నంరాసి అందించాలని పించలేదు పైగా, ఆవు గడ్డి నమిలినట్టు ఆకులు నమిలే అతని తీరు, జుగుప్స కలిగించిందామెలో

కాని వీణ వారి జీవితాల్లో వెలుగు నింపడానికి ప్రవేశించినప్పటినుండి, తాంబూలం సేవించే సమయము, రసమయ సన్నివేశంగా మారిపోయింది శాము భోజనమవగానే వచ్చి, మంచంమీద పడుకునేవాడు వీణ తప్పటడుగులు వేసుకుంటూ వచ్చి మంచాన్ని ఆనుకుని నించునేది శాము వీణ నెత్తి మంచంపైన కూర్చోపెట్టుకునేవాడు మంచం మీద కాళ్లవేపున, మీర ఆకులకు సున్నం రాస్తూ "ఈరోజు మీ అమ్మాయి ఏం చేసిందో తెలుసా?" అంటూ వీణ గుణగణాల్ని ప్రారంభించేది

"ఊహుం. అలాగా ఏం చేసిందేమిటి ? ఏం చేశావమ్మా చిట్టీ ?" కూతురి బుగ్గ గిల్లి అడిగేవాడు శాము ఈ సన్నివేశం భార్యాభర్తలకు అత్యంత ప్రియమైనది

వీణ కృపాదృష్టి తండ్రి జుత్తుమీద పడి, దాన్ని లాగి తన చేతిలో పెట్టుకోవాలని ప్రయత్నించసాగింది మీర "పద్దమ్మా, ఇలా రా తల్లీ" అంది

వీణ మరింత తండ్రికి దగ్గరగా జరిగింది మీర చుట్టిన తమలపాకును, శాముకు అందించబోతే, వీణ తన చేతితో దాన్ని లాక్కుని, శాము నోట్లో పెట్టింది శాము వీణ చేతిని నొప్పవకుండా కొరికి "ఆకు కన్నా కమ్మగా ఉంది, మా అమ్మ చెయ్యి" అన్నాడు

"చాల్లెండి నొప్పవదా, బిడ్డకు ?"

వీణ తల్లి చేతినుండి, ఆకు లాక్కుని, ఈసారి తన నోట్లో వేసుకుంది మీర, శాము, బిడ్డ విషం తిన్నట్టుగా భయపడిపోయి, బిడ్డ నోటిలో నుంచి, ఆకు తీసి పారేశారు వీణ మొండిగా ఏడ్వసాగింది మీర మంచంకింద పక్కలా వెతికి, ఆడుకునే సామానులు తెచ్చి వీణ ముందు పడేసింది వీణ ఏడుపు ఆపి, బొచ్చుకుక్క బొమ్మతో ఆడుకోసాగింది

"వీణ పుట్టినరోజు దగ్గర పడుతోంది" మీర మళ్లీ ప్రారంభించింది.

# అపస్వరం

27 వ పేజీ తరువాయి

"అవును, ఇంకో నెల ఉంది ఆరోజు వూరందరికి భోజనాలు పెట్టాలి నా పెళ్లి భోజనం కూడా పెట్టలేదు వారికి"

"అంతమందికీ వంటెవరు చేస్తారు ?"

"మైసూరి నుండి ఇద్దరు వంటవారిని పిలిపిద్దాం"

"పెదనాన్న వస్తారు కదూ ?"

"ఆయన రాకుండా ఏలా ? పెద్దవారు వచ్చి ఆశీర్వదిస్తే జానికి శ్రేయస్సు"

"వీణకేమి చేయిస్తారు ?"

"రాణిగారు ఏమి చేయించమంటే అది"

"అదే నేనూ ఆలోచిస్తున్నా లోలక్కులు, గాజులు, గొలుసు అన్నీ ఉన్నాయి లేని దేమిటాని?"

"ఒక బుల్లి మొగుడు"

ఒకతను స్నేహితునితో: ఒరేయ్! ఈ వేళ మా యింట్లో వంట చేయ లేదురా.

స్నేహితుడు: ఎందుకని?

అతను: ఈ వేళ ఆదివారం నాకు రెస్టు, కాబట్టి మా ఆవిడ కూడా రెస్టు తీసుకుంటుందట. సమాన హక్కులు కదరా!

రత్నవర్మన్ (పొనుకుమాడు)

"అబ్బబ్బా! మీ రిప్పటినుండీ అలా అనకండి వీణని చదివించాలనుకుంటున్నాను, నేను"

కాస్సేపు ఆలోచించి, మీర "నేనో విషయం చెపుదామనుకొంటున్నా మీ రిష్టపడతారో లేదో ?" అంది

"ఏమిటో చెప్పు"

"వీణకు ముత్యాలు కెంపులు పొదిగిన నెక్లేసు చేయించాలని ఉంది, నాకు కానీ"

"కానీ ఏమిటి ?"

"నెక్లెసుకు బంగారం కావాలా ? ఇప్పుడు బంగారు వెల మండిపోతూంది కదా.."

"ఊఁ"

"ఎలాగూ మీ అమ్మగారి నగలు పెట్టె నిండా ఉన్నాయి వాటిల్లో ఏదో ఒకటి చెరిపిస్తే, నెక్లెస్ సరిపోతుంది"

శాము మెదలకుండా వూరుకున్నాడు చనిపోయిన తల్లిమీది భక్తికీ, బిడ్డమీద వ్యామోహానికీ ఒక నిముషం పోరాటం జరిగింది వీణవేపు చూశాడు వీణ కాళ్లవేపు కూర్చుని, పెద్ద బంతిని నోటిలో కూరుకోవటానికి ప్రయత్నిస్తోంది వీణ మెడలో నెక్లెస్ వేస్తే ఎలా ఉంటుందా అని వూహించుకున్నాడు, శాము బంతిని నోటిలో కూరుకోవటానికి వీణ పడుతున్న అవస్థను చూసి ముద్దొచ్చింది, శాముకు గబుక్కున లేచి, అక్కరతో వీణ బుగ్గలను ముద్దెట్టుక్కున్నాడు.

"నా బంగారు తల్లికి ఏమైనా సరే ఇవ్వచ్చు. దానికి కాకపోతే ఎవరికివ్వాలి మనం ? కావాలంటే అన్ని నగలూ చెరిపించి, కొత్త మాదరీల్లో చేయిద్దాం"

శాము ఇంత త్వరగా తన సలహాకు ఒప్పుకోవటం, ఆశ్చర్యాన్ని కలిగించింది మీరకు.

"ఇప్పటికి నెక్లెస్ ఒకటి చాలు పెళ్లప్పటికి మిగతావి చేయించుకోవచ్చు నెక్లెస్ చేయించటానికి మైసూరి కెళ్లాలేమో ?"

"ఉదయం వెళ్లి సాయంత్రం వచ్చేద్దాం"

"వీణను తీసుకెళ్లాలి"

"జాని వద్దు మీరా వూరికే అలసట బిడ్డకు. ఒకరోజు నేనే వెళ్లి ఆర్డరిచ్చి వస్తాను"

"మీరు ఆర్డరిచ్చిన మాదిరి నాకు నచ్చొద్దూ ?"

"అయితే నువ్వో డిజైను గీసివ్వు అదే మాదిరీలో చేయిద్దాం"

మీర కాయితం, పెన్సిల్ తీసుకుని, నెక్లెస్ డిజైన్ గీయసాగింది ద్రాక్షతీగ రెండువేపులూ అల్లుకుంటూ పైకి పోయింది ద్రాక్షగుత్తులు తీగనుండి వేలాడుతున్నాయి రెండు చిలకలు తీగ మీద కూర్చొని ద్రాక్షగుత్తిని ముక్కుతో పొడవబోతున్నాయి

మీర గీసిన చిత్రాన్ని అద్భుతంగా ఉందని మెచ్చుకున్నాడు శాము కొన్నిచోట్ల తన సలహాలిచ్చాడు. మీర నెక్లెస్‌లో ఎక్కడెక్కడ ముత్యాలూ పచ్చలూ, కెంపులు పొదగాలో వివరించి చెప్పింది. ఆఖరికి ఆ కాయితాన్ని శాము చేతికిచ్చి,

"రేపే వెళ్లిరండి మళ్లీ తయారవటం ఆలస్యమవచ్చు 'మైసూరు జ్యూయలరీ మార్ట్' లోనే చేయించండి" అని చెప్పింది.

"నీకేమీ అక్కర్లేదా, మీరా ?"

"నాకా ? ఇంకా నాకేం కావాలి ?"

"నీకో మైసూర్ జార్జెట్ తెస్తాను ఏరంగు తెమ్మంటావ్ ?"

సూర్యుడు పశ్చిమాన ఉదయించినా అంత ఆశ్చర్యం కలిగేది కాదు, మీరకు మొదటినుండి జార్జెట్టు గుడ్డలంటే, బద్ద ద్వేషం అతనికి పట్టుచీరలలోని గాంభీర్యం నిండుతనం జార్జెట్ గుడ్డల్లో ఉండదని అతని వాదం అలాటి మనిషి ఇప్పుడు తనంతట తానే, జార్జెట్ తెస్తాననగానే తెల్లబోయింది మీర తన చెవులను తనే నమ్మలేక,

"ఇదేం కల కాదు కదా ?" అంది

"ఏం అలా అడుగుతున్నావ్ ?"

"మరింకెలా అడగనూ ? మీకూ జార్జెట్‌కూ అసలు పడదుకదా ?"

శాముకు రెండు నెలల క్రిందటి సంగతి గుర్తుకొచ్చింది ఒక సాయంత్రం, వీణకు గుడ్డలు తొడిగి శాము చేతికిచ్చి తనూ చీర మార్చుకోవటానికి లోపలికి వెళ్లింది మీర వీణ హఠాత్తుగా మొండికెత్తి ఏడువసాగింది ఎంత వోదార్చినా ఏడుపు ఆపలేదు వెంకమ్మగారు దిష్టి తీశారు వీణ గుక్కపట్టి ఏడుస్తూనే ఉంది. వీణను వోదార్చటానికి శాము చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

(సశేషం)

న్యాయాధికారి శ్రీ డార్లింగ్ దారిన్నప్పటికీ వినిపించుకోకుండా తన పని తను చేసుకుపోతూనే ఉన్నాడు బిర్లింగ్—"న్యాయాధికారి శ్రీ డార్లింగ్ గారి పేరు కూడా ఉందా?"

"ఉన్నది" ఆమె సమాధానం చెప్పింది.

నిదానస్థుడైన న్యాయాధికారి ముఖం భయంతో పాలిపోయినట్లయింది సప్తవ్యసనాలకు దాసుడైన వ్యక్తిగా ఆమె తన సాక్ష్యాన్ని చెప్పేసరికి జడ్జి కోపంతో వణికిపోయాడు

పెంబర్టన్ బిర్లింగ్ ఈ అవకాశాన్ని వృథాగా పోనీక నెమ్మదిగా మొదలుపెట్టాడు

"ఈ ప్రజల్ని రక్షించటానికి న్యాయాధికారి తానిడు" అన్నాడు

"నీవు నిశ్శబ్దంగా ఉండకపోతే కోర్టుమంచి బయటికి వెళ్ళాల్సి ఉంటుంది" అన్నాడు డార్లింగ్

పెంబర్టన్ బిర్లింగ్ సాక్షుల్లో మతబోధకుడు ఫాదర్ బెర్నార్డ్‌వాగన్ సమాజంలోని పాపకృత్యాల్ని తీవ్రంగా ఖండించాడు అతను సాక్ష్యమివ్వటానికి బోనులోకి రాగానే "నేను వీటిని గురించి మత బోధకునిగా ఏమీ చెప్పబోవటంలేదు దేశాన్ని ప్రేమించే దేశభక్తునిగా మాత్రమే మాట్లాడు తాను" అని చెప్పాడు.

"సమాజంలోని అన్ని తరగతులవారూ ఈ విశేష ప్రదర్శనలోని అసభ్య దృశ్యాలవల్ల దుర్వ్యసనాలకు లోనై ఆహుతైపోతున్నారు" అని తన అభిప్రాయాన్ని చెప్పాడు

ఫాదర్‌వాగన్ బోనులోనుంచి బైటికి వచ్చి పెంబర్టన్ బిర్లింగ్ ప్రక్కగా నిల్చుని మెల్లగా చెయ్యెత్తి అతన్ని ముమ్మారు ఆశీర్వదించాడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా వినిపించేటంతటి ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని భేదిస్తూ నలుగురికీ విన బడేలా, "దేవుడు సదా నిన్ను రక్షిస్తాడు. నీవు అతని కార్యాన్ని నెరవేరుస్తున్నావు" అన్నాడు పెంబర్టన్ బిర్లింగ్ నుద్దేశించి.

ఇంకొకసాక్షి సర్ ఆల్ఫ్రెడ్‌ఫ్రిప్ సమాజంలోని పాలకవర్గానికి చెందినవారు చాలామంది ఈ వక్ర మార్గాలను అనుసరిస్తున్నారని చెప్పగానే అందరూ స్తబ్ధులైనారు అతను సాక్ష్యమివ్వటానికి బోను లోకి వెళ్లేముందే పెంబర్టన్ బిర్లింగ్ అతన్ని హెచ్చరించాడు.

"నేను మిమ్మల్ని ఏదైనా ప్రశ్న అడిగిన వెంటనే జేబులోనించి ఈకాగితాన్ని తీసి నాకివ్వండి ఏం మాట్లాడవద్దు. కాగితాలు నాకిచ్చి మెదల కుండా నిల్చోండి అని చెప్తూ ఓ కాగితాన్ని అతని జేబులో ఉంచాడు.

తర్వాత సమయంకనిపెట్టి ఆల్‌ఫ్రెడ్‌ని ప్రశ్నించాడు "దేశక్షేమం దృష్ట్యా మీరు ప్రభుత్వంలో ఉన్న వక్రమార్గావలంబకుల పేర్లను కోర్టువారి కివ్వగలరా?"

సర్ ఆల్‌ఫ్రెడ్‌ఫ్రిప్ తన జేబులోని కాగితాన్ని బయటకు తీస్తుండగానే న్యాయాధికారి గాభ రాగా "ఆకాగితాన్నిలా యివ్వండి" అంటూ దాన్నం దుకోడానికి ఆల్‌ఫ్రెడ్ వైపు చేయిజాపాడు.

"మిలార్డ్! ఆకాగితాన్ని మీ చేతికిస్తే అందులోని విషయాల్ని నలుగురికీ తెలుస్తాయి పైగా జ్యూరీ కూడా దాన్ని చూడాల్సి ఉంటుంది" అని అరిచాడు పెంబర్టన్‌బిర్లింగ్

# మానసంరక్షణకోసం

23 వ పేజీ తరువాయి

న్యాయాధికారి డార్లింగ్ కొంచెం తటపటా యించి "సర్ ఆల్‌ఫ్రెడ్! దాన్ని మీ జేబులోనే భద్రపరుచుకోండి" అన్నాడు.

ఫ్రిప్ అలాగే చేశాడు. కానీ అది కేవలం తెల్ల కాగితం మాత్రమేనని ఒక్క పెంబర్టన్‌బిర్లింగ్‌కే తెలుసు.

ఒకప్పుడు ఓస్కార్ వైల్డ్ స్నేహితుడూ ప్రస్తుతం ప్రబల శత్రువు అయిన లార్డ్ ఆల్ఫ్రెడ్ డగ్లస్ తన సాక్ష్యంలో 350 సంవత్స రాల్నుంచీ యూరప్‌లో వ్యాపిస్తున్న ఒక దుష్ట శక్తని వ్యాఖ్యానించాడు వైల్డ్ 'సలోమ్'ని అను వదించటాన్ని అతడు తీవ్రంగా విమర్శించాడొ ప్పుడు.

"మీరు చూసిన ఆటని సదరు నటీమణి దీనికి ఏమిటి సంబంధం?" డార్లింగ్ ప్రశ్నించాడు

"విడిగా ఆమె నడవడికను గూర్చి చెప్పుకోదగ్గ దేంలేదు" పెంబర్టన్‌బిర్లింగ్ సమాధానం చెప్పాడు.

లార్డ్ ఆల్‌ఫ్రెడ్ డార్లింగ్ "వచ్చి అబద్ధాల కోరు" అని చెప్పగానే కోర్టంతా గొల్లుమంది.

ఇలాకొన్ని సంవత్సరాలపాటు విచారణ జరుగు తూనే ఉంది. ఇప్పుడది పెంబర్టన్‌బిర్లింగ్ మిస్ అలన్‌ని దూషించినందుకు విచారణలాకాక అతని దేశభక్తి నిరూపణను నిరూపించే విచారణ లా తయారైంది

చివరికి పెంబర్టన్‌బిర్లింగ్ నిర్దోషని జ్యూరీ తేల్చేసింది ఆ సమయంలో కొద్దిసేపు కోర్టులో మాత్మోగిన సంతోష సూచక నినాదాల్ని అదు పుచేయ డార్లింగ్‌కి శక్తికిమించిన పనైపోయింది.

(వైవారం మరొకటి)




" ఇంకా ఎంతకాలం వుంచుకుంటావోయ్ ఆ క్యాలెండర్లు?? "

# వేల్పులకైనా మార్పులు తప్పవు

మహేష్

(గత సంచిక తరువాయి)

## విష్ణువు

వైష్ణవ మతం చతుర్వ్యూహ సిద్ధాంతం వైష్ణవమతానికి చెందిన ప్రాచీన సిద్ధాంతాల్లో చతుర్వ్యూహ సిద్ధాంతం ఒకటిగా భావించబడుతుంది కేవలం వాసుదేవ కృష్ణుడే కాకుండా సంకర్షణ, ప్రద్యుమ్న, సాంబ, అనిరుద్ధులు కూడా పూజింపబడినట్లు చారిత్రిక సాక్ష్యాలు ఉన్నాయి వీరందరూ కూడా వృష్ణి వంశానికి చెందినవారు కావడంవలన యిది వీరపూజగా కూడా భావించబడుతుంది కాలక్రమంలో పై అయిదుగురులోను సాంబుని మినహాయించి మిగిలిన నలుగురనుమాత్రం పూజించేవారు. సాంబుని తల్లి అయిన జాంబవతి, అనార్యుడైన ఋక్ష రాజు కుమార్తె కావడం, సాంబుడు ఈశ్వరుని వరంవల్ల జన్మించడం, వైష్ణవులు పూజనుంచి సాంబుని తొలగించడానికి కారణమయి ఉండవచ్చునని ఆధునిక చరిత్రకారుల అభిప్రాయం. సాంబుని సౌరమతానుయాయిగా కొందరు, సూర్యునిఅవతారంగా కొందరు తరువాత భావించినారు.

వాసుదేవుడే పరబ్రహ్మ. అతడు తనమంచి సంకర్షణ వ్యూహమును, ప్రకృతిని సృష్టించెను సంకర్షణ ప్రకృతుల సంయోగమువలన ప్రద్యుమ్న వ్యూహము, మనస్సు ఉద్భవించినవి ప్రద్యుమ్న, మనస్సుల సంయోగమువలన అనిరుద్ధ వ్యూహము, అహంకారము జన్మించినవి అనిరుద్ధాహంకారముల సంయోగమువలన మహా భూతములు బ్రహ్మ ఉద్భవించిరి. భగవంతుడైన వాసుదేవుడు జ్ఞానబల వీర్యైశ్వర్య శక్తి తేజోవంతుడిగా కీర్తింపబడుచున్నాడు.

## భగవద్గీత

వైష్ణవమతం ముఖ్యంగా భగవద్గీతమీద ఆధారపడినదని ఆధునికుల అభిప్రాయం సకలోపనిషత్సారమునే శ్రీకృష్ణుడు భగవద్గీతా రూపమున అర్జునునకు ఉపదేశించినట్లు మహా భారతంలోని భీష్మ పర్వంలో చెప్పబడింది సర్వోపనిషత్తులు ఆవు, అర్జునుడే దూడ, కృష్ణుడే పాలను పితుకువాడు అయి గీత అనే పాలను పితికినట్లు వర్ణించబడింది. భగవద్గీత కేవలం వైష్ణవుల చేతనే కాకుండా హిందువులందరిచేత గౌరవింపబడుతుంది శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలుకొని, నేటి తిలకు పండితుని వరకు, అనేకమంది పండితులు తమ తమ అభిప్రాయముల ననుసరించి భగవద్గీతకు వ్యాఖ్యానములను రచించిరి. దీనిపై వచ్చినన్ని వ్యాఖ్యానములు మరి ఏ ఇతర హిందూ గ్రంథముపైనను రాలేదన్న విషయం భగవద్గీతా ప్రాముఖ్యతను తెలియజేయుచున్నది. హిందువులకు వేదముల తర్వాత పూజనీయమైనది భగవద్గీత. ఇది 18 అధ్యాయములుగా విభజింపబడినది.

## అర్జున విషాదయోగం

భారత యుద్ధము నిమిత్తం కురు పాండవ సేనలు కురుక్షేత్రమందు నిలచినవి. రెండు పక్షములలోను యుద్ధోన్ముఖులైన బంధువులను చూచి అర్జునుడు, జరగబోవు యుద్ధంలో వారల మరణమును పూహించి యుద్ధమనే తన ధర్మము నుంచి విముఖుడయ్యెను.

## సాంఖ్య యోగం

అర్జునుని రథ సారథ్యమును వహించిన కృష్ణుడు కర్తవ్యతామూఢుడైన అర్జునునికి స్వధర్మాచరణమే శ్రేయోదాయకమని ఉపదేశించెను దేహనాశనమును గురించి పండితులు విచారింపరు. ఆత్మ దేహము కంటె భిన్నమైనది ఆత్మ ఒకప్పుడు పుట్టినది కాదు. ఒకప్పుడు మరణించునది కూడా కాదు




ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకపోవునదికాదు ఒకప్పుడు లేక మరొకప్పుడు ఉండునది కూడా కాదు. ఆత్మ పుట్టుక లేనిది శాశ్వతమైనది శరీరము నశించినను ఆత్మ నశించదు అందుచేత దేహ నాశనము జరుగునని కర్తవ్యమును విడువకూడదు కర్మఫలమందు ఆసక్తి లేకుండా కర్మమును ఆచరింపవలెను. స్థిత ప్రజ్ఞ లక్షణం ఇందులో వివరింపబడింది.

## కర్మయోగం

జ్ఞానముచేతను, కర్మముచేతను మోక్షము సాధ్యమగుచుండగా, కర్మయోగమునే ఏల అనుసరింపవలెనని అర్జునుడు కృష్ణుని ప్రశ్నించెను. కర్మలను చేయకపోవుటవలన, కర్మను విడిచి పుచ్చుటవలనగాని మానవుడు నైష్కర్మ్యమును పొందడు మానవుడు ప్రకృతివలన పుట్టిన గుణముల వలన ఎల్లప్పుడు ఏదో ఒక కర్మను చేయుచుండును. కర్మ వేదములవలన కలుగుచున్నది. వేదము, ఈశ్వరునివలన కలుగుచున్నది. అందుచేత కర్మను ఆచరించనివాడు ఇంద్రియలోలుడు వ్యర్థమైన జీవనము కలవాడు అగుచున్నాడు. ఎవడు ఆత్మయందే ఆసక్తి కలవాడగుచున్నాడో ఆత్మయందే తృప్తి సంతోషము పొందుచున్నాడో వానికి కర్మలతో నిమిత్తములేదు. అలాగైనా మానవుడు లోకము కొరకు కర్మను చేయవలసి ఉన్నది. జనకుడు మొదలైనవారు కర్మచేతనే మోక్షమును పొందిరి ఉత్తమ పురుషుడనుసరించిన మార్గమునే ఇతరులు కూడా అనుసరింతురుగదా! అని కృష్ణుడు అర్జునునకు సమాధానమిచ్చెను.

## జ్ఞాన యోగం

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు అభివృద్ధి కలుగునో, అప్పుడు నేను అవతరించెదను. సజ్జనులను రక్షించుటకు, దుర్జనులను శిక్షించుటకు, ధర్మమును స్థాపించుటకును ప్రతి యుగమందును నేను ఉద్భవించెదనని శ్రీ కృష్ణుడు అర్జునునికి చెప్పెను ఎవరు ఏవిధంగా నన్ను ఆశ్రయించుచున్నారో వారిని ఆవిధంగానే నేను అనుగ్రహించుచున్నాను మానవులు అన్ని విధములా నా మార్గమునే అనుసరించెదరు. కర్మయందు కర్మాభావమును, కర్మాభావమందు కర్మను ఎవడు చూచుచున్నాడో అతడే బుద్ధిమంతుడు, యోగి. ఎవడు ఫలాసక్తిని విసర్జించి, నిత్యతృప్తుడు, ఆశ్రయ రహితుడు అగుచున్నాడో అతడు కర్మలను ఆచరించినప్పటికి ఏమియు చేయని వాడే అగుచున్నాడు. ద్రవ్య సాధ్యమగు యజ్ఞములకంటె జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠమైనది అగ్ని సమిధలను భస్మము చేయునట్లుగా జ్ఞానాగ్ని సర్వ కర్మలను భస్మము చేయును.

## కర్మసన్న్యాస యోగం

"కర్మలను విడిచి పెట్టుము" అని చెప్పెను, మరల "కర్మలను చేయుము" అని చెప్పుచున్నావు ఈ రెండింటిలో ఏది మంచిదో నిశ్చయముగా చెప్పుమని అర్జునుడు కృష్ణుని ప్రశ్నించెను. కర్మలను విడిచి పెట్టుట వలనను, కర్మలను ఆచరించుటవలనను కూడ మోక్షము లభించును కాని వీనిలో కర్మ పరిత్యాగముకంటె కర్మానుష్ఠానమే మంచిది సాంఖ్యమును, యోగమును ఒక్కటిగా ఎవడు చూచుచున్నాడో అతడే జ్ఞాని. యోగులు ఫలాసక్తిని విడిచిపెట్టి ఆత్మ శుద్ధి కొరకు, కర్మలను చేయుచున్నారు. ఫలాసక్తి లేకుండా ఎవడు కర్మను బ్రహ్మయందుంచి ఆచరించునో అతనికి పాపములు అంటజాలవు.

## ఆత్మసంయమ యోగం

తాను తన మనస్సును ఉద్ధరించుకొనవలెను. తన మనస్సును చెరుపుకొనరాదు తన మనస్సే తనకు బంధువు. తన మనస్సే తనకు శత్రువు ఎవడు తన మనస్సుచేత దేహేంద్రియాదులను జయించుచున్నాడో వానికి తన మనస్సు బంధువగుచున్నది. ఇంద్రియ నిగ్రహములేని వానికి తన మనస్సే శత్రువగుచున్నది. యోగి సర్వ భూతములయందును తనను, తనయందు సర్వ

భూతములను దర్శించును. ఎవడు సమస్త భూతము లందు నన్నును, నాయందు సమస్త భూతము లను చూచుచున్నాడో వానికి నేను నాకు అతడు ప్రత్యక్ష స్వరూపులుగా ఉందుము తపస్సు చేసిన వారికంటెను, జ్ఞానులకంటెను, కర్మానుష్ఠానము చేయువారికంటెను యోగి అధికుడు

## విజ్ఞాన యోగం

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని నా మాయా శక్తి ఎనిమిది విధములైనది ఈ ప్రకృతి అపరిశుద్ధమైనది జీవభూతమై పరిశుద్ధమైన ప్రకృతి వేరొకటి యున్నది దానిచేత ఈ జగత్తు ధరించబడినది సమస్త ప్రపంచముయొక్క ఉత్పత్తి వినాశములకు నేనే కారణము ఈ ప్రపంచమునకు నాకంటే మరియొక కారణములేదు ఎవడు శ్రద్ధతో ఏ దేవుని పూజించుచున్నాడో, వానికి ఆ దేవునియందుగల శ్రద్ధను స్థిరము చేయుచున్నానని కృష్ణుడు అర్జునునితో చెప్పెను

## అక్షర పరబ్రహ్మ యోగం

జగత్కారణమగు అక్షరము బ్రహ్మము ఆ పరబ్రహ్మము, సృష్టియందు ప్రతి దేహమందును ప్రత్యగాత్మగా ఉండుటయే అధ్యాత్మం భూతములయొక్క స్థితిని ఉత్పత్తిని కలుగజేయు, ద్రవ్య త్యాగ రూపమగు యజ్ఞమే కర్మ. నశించే స్వభావముగల సకల చరాచరములే అధిభూతము. హిరణ్యగర్భుడే అధిదైవం. జీవకోటియొక్క దేహమందు ఉన్న అధి యజ్ఞమును నేనే ఎవడు అంతిమ కాలమందు నన్ను స్మరించుచు దేహమును త్యజించునో వాడు నా భావమునే పొందును అని కృష్ణుడు పార్థునకు ఉపదేశించెను.

## రాజవిద్యా రాజగుహ్య యోగం

అంతటను సంచరించు వాయువు ఎల్లప్పుడు ఆకాశమందెట్లు ఉండునో, అట్లే సర్వ భూతములు నాయందు ఉన్నవి. కల్పాంతమందు సకల భూతములు నా మాయయందు లయమగుచున్నవి. కల్పాదియందు మరల నేనే వాటిని సృష్టించెదను. ఎవరు ఇతరులను సేవించకుండా నన్ను సేవించుచున్నారో అట్టి అచంచల చిత్తులయిన జనుల యోగ క్షేమములను నేనే వహించుచున్నాను. ఎవడు భక్తితో పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని నాకు సమర్పించుచున్నాడో అటువంటి భక్తుడు సమర్పించిన పత్ర పుష్పాదులను నేను స్వీకరించుచున్నాను నాయందే మనస్సును ఉంచుము, నా భక్తుడవు కమ్ము, నన్ను పూజింపుము, నాకే నమస్కరింపుము. అట్లైన నన్నే పొందగలవని శ్రీకృష్ణుడు ఉపదేశించెను.

## విభూతియోగం

నేను, జననము, ప్రారంభములేనివాడను. మనువులు మహర్షులు నా సంకల్పమువలన జన్మించిరి ఎవడు భృగువు మొదలైన ఈ నా విభూతిని యోగమును తెలిసికొనుచున్నాడో అతడు యోగ సిద్ధిని పొందుచున్నాడు నా విభూతులకు అంతము లేదు ప్రపంచములో ఐశ్వర్యముతో కూడినదియు, ఉత్కృష్టమైనదియు అయిన ప్రతి వస్తువును, నా తేజస్సుయొక్క అంశ వలననే కలిగినదని తెలిసి కొనుమని శ్రీ కృష్ణుడు అర్జునునకు ఉపదేశించెను వేదములలో సామవేదము, దేవతలలో యింద్రుడను నేనని కొన్ని ఉదాహరణలను ఇచ్చెను

## విశ్వరూప సందర్శన యోగం

శ్రీ కృష్ణుని దివ్య రూపమును అర్జునుడు చూడగోరి ప్రార్థించగా శ్రీ కృష్ణుడు సహస్ర సూర్య ప్రభా భాసమానమగు తన విశ్వ రూపమును అర్జునునికి చూపించెను

## భక్తియోగం

ఎవరు సర్వ కర్మలను నాయందు సమర్పించి, నాయందు మనస్సును ఉంచి అనన్యమైన భక్తిచే నన్ను ఉపాసించుచున్నారో వారలను మృత్యు సంసార

---

## వేళ్ళలకైనా మార్కులు

తండ్రి : ఏరా పరీక్ష పేపర్లు యిచ్చారుట ఎన్ని మార్కులు వచ్చాయో చెప్పలేదే.

కొడుకు : ఇంకా అన్ని పరీక్ష పేపర్లు యివ్వలేదు నాన్నా.

తండ్రి : ఇచ్చిన పేపర్లలో ఎన్ని మార్కులు వచ్చాయి

కొడుకు : అన్నీ యిచ్చాక చెబుతా నాన్నా. యిప్పుడొకసారి, అప్పుడొకసారి తినడం ఎందుకు.

తండ్రి : ఏమిట్రా తినేది.

కొడుకు : తిట్లు.

బి. వి. రమణారావు. (విజయవాడ)

---

సాగరమునుంచి త్వరలోనే ఉద్ధరింతును. చిత్తమును నాయందు స్థిరముగా ఉంచలేని ఎడల యోగాభ్యాసముచేత నన్ను పొందుటకు ప్రయత్నించవలెను అభ్యాసము చేయుటకును సామర్థ్యము లేని ఎడల నా కొరకు కర్మలను చేసి మోక్షమును పొందవచ్చును. అది కూడా చేయలేని ఎడల నియత చిత్తము కలవాడవై సర్వ కర్మ ఫలత్యాగము చేయవలెను అభ్యాసముకంటె జ్ఞానము గొప్పది జ్ఞానముకంటె ధ్యానము గొప్పది ధ్యానముకంటె కర్మ ఫలత్యాగము గొప్పది.

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగం

పృధివ్యాది పంచభూతములు, అహంకారము, ఇంద్రియములు, మనస్సు, శరీరము మొదలైనవి క్షేత్రమని చెప్పబడుచున్నవి విషయములందు వైరాగ్యము, అహంకారశూన్యత్వము, అధ్యాత్మజ్ఞానము మొదలైనవి జ్ఞానమని తెలియబడుచున్నది. ఏది భూతములయందు అవిభక్తముగా ఉన్నా విభక్తమువలె ఉన్నదో, సమస్త భూతములను ఏది సృష్టించుచున్నదో, పోషించుచున్నదో, గ్రహించుచున్నదో అదియే జ్ఞేయము ప్రకృతి పురుషులిద్దరును ఆదిలేనివారు స్థావర జంగమ రూపమగు వస్తువులన్నియు క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగమువలననే కలుగుచున్నవి

## గుణత్రయ విభాగ యోగం

ప్రకృతివలన సత్వరజస్తమో గుణములు జన్మించినవి సత్వ గుణమువలన జ్ఞానము రజో గుణమువలన లోభము, తమో గుణమువలన ప్రమాద మోహములు, అజ్ఞానము కలుగుచున్నది జీవుడు ఈ గుణత్రయమును అతిక్రమించి జన్మ మృత్యు జరా దుఃఖములచేత విడువబడినవాడై మోక్షమును పొందుచున్నాడు

## పురుషోత్తమ ప్రాప్తియోగం

అశ్వత్థ రూపమైన సంసార వృక్షమునకు మాయాంశ జనితమగు బ్రహ్మమే మూలము మహదహంకారములు కొమ్మలు, వేదములు ఆకులు. ఈ వృక్షముయొక్క కొమ్మలు గుణములచేత వృద్ధినిపొంది విషయములను చిగుళ్ళు కలిగి అంతటను వ్యాపించియున్నవి. ఈ వృక్షమును వైరాగ్యమను ఖడ్గముచేత ఖండింపవలెను సర్వ భూతములను క్షరునిగాను, కూటస్థుని అక్షరునిగాను తెలియవలెను ఈ ఇద్దరికంటె ఉత్తముడైన పురుషుడే పరమాత్మ నేను క్షరాక్షరులకంటె ఉత్తముడనగుటచేత పురుషోత్తముడనని ఖ్యాతి పొందితిని ఎవడు నన్ను ఈ రీతిగా తెలిసికొనుచున్నాడో అతడు నన్నే పొందగలడని శ్రీ కృష్ణుడు ఈ అధ్యాయంలో అర్జునునకు ఉపదేశించెను

## దైవాసుర సంపద్విభాగ యోగం

నిర్భయము, చిత్తశుద్ధి, అహింస, సత్యము, తేజస్సు మొదలైనవి దేవాంశయందు జన్మించిన వారికి కలుగును దంబము, క్రోధము, అజ్ఞానము మొదలైనవి అసురాంశయందు జన్మించిన వారికి కలుగును. దేవాంశ లక్షణములను ఇదివరకు చెప్పియుండుటవలన ఈ అధ్యాయమందు అసురాంశ వర్ణించబడింది

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

సత్వ రజస్తమో గుణములవలన కలుగు సాత్త్విక రాజసికతా మసిక శ్రద్ధలు ఇందులో వివరింపబడినవి. ఈ గుణములవలన ఆహార యజ్ఞ తపో దానాది భేదములు కూడా వర్ణింపబడినవి

## మోక్ష సన్న్యాస యోగం

కామ్య కర్మలను విడచిపెట్టుటయే సన్న్యాసము. సర్వకర్మ ఫలమును విడచిపెట్టుటయే త్యాగము. త్యాగము సత్వరజస్తమో గుణ భేదమువలన మూడు విధములు మమకార ఫలకాంక్షలను వదలి యజ్ఞ దానతపః కర్మలను చేయవలెను. సత్వరజస్తమో గుణములవలన కలుగు త్యాగ, జ్ఞాన, కర్మ, కర్తృ బుద్ధి, ధృతి సుఖ భేదములు వివరించబడినవి. సర్వ ధర్మములను పరిత్యజించి నన్నే శరణుపొందుము నేను నిన్ను సర్వ పాపములనుంచి విడిపించెదనని శ్రీ కృష్ణుడు అర్జునునకు ఉపదేశించెను. (విశేషం)




మౌల్వీకి ఓ చిన్న చేంకవుంది. దాన్ని దున్నుకొని గోధుమ వేసేవాడు. పదో పన్నెండో బస్తాలు అయ్యేది. దానితో రోజులు దొర్లించేసేవాడు.

తైమూరు రాజ్యానికి వచ్చేక పన్నులు పెంచడం మొదలెట్టేడు. గ్రామాధికారులు ఆ అవకాశం తీసుకొని తోచినంత వసూలు చేయడం మొదలు పెట్టేరు. మౌల్వీగారి వూరి పెద్ద మాత్రం తక్కువ వాడా?

"నీకీ ఏడాది నూరు బస్తాలు పండింది. ఆ లెక్కని పన్ను ఇవ్వాలి-" అని జబర్దస్తీ చేసేరు.

మౌల్వీ బ్రతిమలాడేడు.

"బాబ్బాబు! పదిబస్తాలు కూడా పండలేదయ్యా!"-అన్నాడు. కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

కాని గ్రామాధికారి వినిపించుకోలేదు. ఇంట్లో వున్న గింజలన్నీ వూడ్చి పట్టించుకుపోయాడు.

మౌల్వీ తన గోడు తైమూర్‌కే చెప్పుకుందామని పట్టణం వెళ్ళేడు. కాని, ఆయన ఫిర్యాదు విని తైమూర్ మండిపడ్డాడు. కేకలేశాడు.

"తెగబారెడు గడ్డమూ నువ్వూ అబద్ధాలాడుతున్నావా? సిగ్గులేదూ?"

మౌల్వీ ఇంకలాభంలేదని వెనక్కి తిరిగేడు. రాజు ఆగమన్నాడు.

"ఏం పోతావేం?"

మౌల్వీ వంగి నమస్కరించాడు.

"మా గ్రామ పెద్దది తప్పులేనట్లే కనిపిస్తాంది. నా పిడికెడు గడ్డం నీ కంటికి బారెడుగా అనింది. ఇంక మా వూరి పెద్దకి ఆ పది బస్తాలు వంద బస్తాలుగా కనిపించడంలో ఆశ్చర్యంలేదు." ★

## ఎన్. టి. ఆర్. తేనీటివిందు

ఆంధ్రప్రదేశ్ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఎ. కె. కె. నంబియార్ మద్రాసు వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని, ఆయనకు నటుడు శ్రీ ఎన్. టి. రామారావు మార్చి 30 వ తేదీ సాయంకాలం 6 గంటలకు ఎన్.ఎ.టి. వారి కార్యాలయంలో తేనీటి విందు చేశారు. ఆ విందుకు హాజరయిన వారిలో శ్రీయుతులు ఎస్. వి. రంగారావు, పద్మనాభం, జమున, గీతాంజలి, ఛాయాదేవి, వాణిశ్రీ మొదలయినవారు ఉన్నారు.

## పాదుకా పట్టాభిషేకం

సీతాదేవికి పట్టాభిషేకపు దుస్తుల్ని ఎన్నిక చేస్తున్నది పూర్ణిమ. ఇంతలో కౌసల్యాదేవి అక్కడికి వచ్చింది. కోడల్ని చూసి నవ్వుతూ "పూర్ణిమా, మీ అక్క ధరించవలసిన పట్టాభిషేకపు వస్త్రాలు ఇప్పటికైనా కుదిరాయా?"

## చిత్రలహరి

అని అడిగింది. చటుక్కున లేచి "ఇంకా లేదత్తయ్యా!" అంటూ సిగ్గుపడ్డది.

"మంచిదానివే, నేనే అనుకుంటే నన్ను మించి పోయావు, నిర్ణయించేసరికి ముహూర్తం మించి పోదుకదా?" నవ్వింది కౌసల్య.

లక్ష్మణుడు నవ్వుతూ "నిజం చెప్పావు తల్లీ! నీ కోడలు ఒక నిర్ణయానికి వచ్చేసరికి నువ్వన్నట్లే జరుగుతుంది" ఎగతాళి చేశాడు, పూర్ణిమను క్రీగంట చూస్తూ.

"అమ్మా, నీకో సంతోషకరమైన వార్త చెప్పాలని వచ్చాను!" అన్నాడు లక్ష్మణుడు తల్లివేపు తిరిగి.

"ఏమిటి నాయనా?" అడిగింది.

"గంగాతీరమునుండి మా పినతల్లి కైకేయి వస్తున్నట్లు వార్త తెలిసింది" చెప్పాడు.

పూర్ణిమ ఉత్సాహం నిండిన కళ్లతో భర్తను చూసింది.

"అలాగా అయితే ఆ లోటు కూడా తీరిందన్నమాట!" కౌసల్య వదనంతో ప్రశాంతత నెలకొన్నది. ఆమె హృదయం యిప్పుడు ముగంతో నిండుకొన్నది.

—ఈ సన్నివేశం అమరావతి చిత్రవారి "పాదుకా పట్టాభిషేకం" చిత్రంలోనిది. కౌసల్యగా మాలతి, పూర్ణిమగా జయంతి, లక్ష్మణుడుగా కొత్త నటుడు శశికాంత్ నటించి, ఆ సన్నివేశాన్ని రక్తి కట్టించారు. ఇది మార్చి 29 వ తేదీన సిటాడెల్ స్టూడియోలో చిత్రీకరించారు.

సంభాషణలు, పాటలు, పద్యాలు ... వద్దాది వ్రాశారు. సంగీతం ఘంటసాల, నృత్యాలు: వేణుగోపాల్, ఆర్ట్: గోడ్‌గాంకర్, ఎడిటింగ్: మాణిక్యం, కెమెరా: వెంకట్ నిర్వహించే యీ చిత్రానికి దర్శకత్వం సిన్నలవారి వసంతకుమార రెడ్డి. మొదట్లో పూర్ణిమ పాత్ర సవితాదేవిని సెట్స్‌మీద చూడడం జరిగింది. కారణాంతరాల వలన ఆమె స్థానంలో ఇప్పుడు వర్తమాన నటి జయంతిని వినియోగించుకుని షూటింగు జరుపుతున్నారు. ఇందులో భరతునిగా ... నటిస్తున్నారు.



'దేవత'లో రామారావు, సావిత్రి.

## తిరుపతి పాలిటెక్నిక్‌లో హరనాథ్, కుమారి శారదలకు సన్మానం!

తిరుపతిలోని గవర్నమెంట్ పాలిటెక్నిక్ విద్యార్థులు మార్చి 27 న హాస్టల్ డే జరిపారు. ఆ సందర్భంగా నటుడు హరనాథ్, నటి కుమారి శారదలను ఆహ్వానించారు. ... నాలుగు వేల మంది విద్యార్థులు హాజరయిన ఆ సభకు తిరుపతి కాటన్‌మిల్స్ జనరల్‌మానేజరు శ్రీ వి. వెంకట సుబ్బయ్య అధ్యక్షత వహించగా ప్రిన్సిపాల్ శ్రీ నరసింహమూర్తి ప్రారంభోపన్యాసం చేశారు.

హరనాథ్ మాట్లాడుతూ "విద్యార్థులకు అల్లరి అవసరమనీ, అయితే అది దౌర్జన్యకాండతో కూడినదిగా ఉండకూడదనీ, క్రమశిక్షణతో నిండినదిగా ఉండాలనీ" అన్నారు. "హాస్టల్ జీవితం విద్యార్థి దశలో ప్రతివారు ఒక్కసారైనా అనుభవించాలనీ, అందులో నిర్వచించలేని ఆనందం ఇమిడి ఉన్నదనీ" వివరించారు హరనాథ్, తన కాలేజీ జీవితాన్ని ఉదాహరించుతూ.

"కాలేజీ, హాస్టల్ జీవితాలు ఎలా ఉంటాయో నాకు తెలీదు. ఎందుకంటే నేను ఎక్కువగా చదువుకోలేదు. ఆ అదృష్టం నాకు లేదు. అయినా ఇప్పుడు మీ అందరి మధ్య ఉండగలగడం వలన ఆ అదృష్టాన్ని పంచుకుంటున్నందుకు ఆనందంగా ఉన్నది. ఈ అవకాశం కల్పించిన మీ అందరికు నా హృదయపూర్వక ధన్యవాదాలు" అన్నది కుమారి శారద.

ఉపన్యాసాలనంతరం విజేతలకు బహుమతులను పంచిపెట్టినది కుమారి శారద. చివరన రెండు

హైటీకి ప్రదర్శించారు విద్యార్థినులు. అవి ఒకటి "తుఫాను" మరొకటి "మిత్రద్వయము". సెక్రటరీ వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసినది.

## దైవశాసనం

ఉషా ఫిలిమ్స్‌వారు "దైవశాసనం" అనే చిత్రం తయారుచేస్తున్నారు ఇందులో బి సరోజాదేవి, దేవిక, కన్నాంబ, సంధ్య, శివాజీగణేశన్, నాగేష్ మొదలయినవారు నటించారు మాటలు, పాటలు శ్రీ శ్రీ, సంగీతం విశ్వనాథం? విమర్తి, ఎడిటింగ్ బాబు, కళ పి హెచ్ ఇ ప్రసాదరావు, కెమెరా · డబ్ల్యు ఆర్ సుబ్బారావు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఎ పి నాగరాజన్, నిర్వహణ పాతూరి సుబ్బారావు సర్కస్ దృశ్యాలు యీ చిత్రంలో ప్రత్యేక ఆకర్షణ అని తెలుస్తున్నది.

## మద్రాసులో ఆంధ్రుల ఉగాది వేడుకలు

ఉత్తర మద్రాసులోని ఆంధ్రులు ఏప్రిల్ 2 వ తేదీన వాషర్‌మెన్ పేటలోని త్యాగరాయ కాలేజీ కళామండపంలో ఉగాది వేడుకలు జరిపారు సాయంకాలం 5—30 గంటలకు ప్రారంభమైన సభకు ప్రఖ్యాత సినీ దర్శకులు శ్రీ కె కామేశ్వరరావు అధ్యక్షత వహించారు శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర ప్రసంగించారు సినిమా నేపథ్యగాయనీ గాయకులు కుమారి వసంత, బసవేశ్వర్‌లు సంగీతకచేరీ జరిపి, ప్రేక్షకుల హృదయాలను రంజింపజేశారు వాద్య గోష్ఠిని శ్రీ ఏ ఏ రాజ్ నిర్వహించారు

అంతర్యున్నత పాఠశాలల వక్తృత్వపు పోటీలలో గెలుపొందినవారికి శ్రీమతి రాజసులోచన బహుమతులను పంచి యిచ్చారు

## శివశక్తి మూవీస్

"మొదటిసారి చూసినపుడు ఎలా ఉన్నది?" అడిగారు ఘంటసాల "నిన్ను మొదటిసారి చూసినపుడు భలే ఉన్నది" అంటూ చమత్కరించినది పి సుశీల ఇది శివశక్తి మూవీస్‌వారు నిర్మించుతున్న జానపద చిత్రానికిగాను దాశరథి వ్రాసిన గీతం మార్చి 26 న ఏ వి యం స్టూడియోలో సంగీత దర్శకుడు కోదండపాణి అధ్యక్షంలో పై వారిద్దరూ పాడగా, సౌండ్ రికార్డిస్ట్ జె జె మాణిక్యం రికార్డ్ చేశారు ఈ గీతానికి ఇరవైమూడు వాయిద్యాలను ఉపయోగించారు ఇంతవరకు ఈ చిత్రం పన్నెండు రీళ్లు తయారయింది రాజశ్రీ, కాంచన ప్రధాన భూమికలు పోషించుతున్నారు దర్శకుడు యస్ ఆర్ పుట్టన్న (శర్మ) ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ : డి బి నారాయణ.

## ఆకాశరామన్న

"నమస్కారం!" అంటూ ప్రవేశించాడు కళాధరుడు

"రా, కళాధరా!"

"ఎక్కడికో ప్రయాణం అవుతున్నట్టున్నారు!"

"అవును విందుకు వెళ్తున్నాం నువ్వు కూడా రాకూడదూ?" అడిగాడు అనంగుడు

"వద్దులెండి, నా కలాంటి అలవాట్లు లేవు"

"సరే నీ ఇష్టం! ఇంతకీ వచ్చిన పని చెప్పావు కాదేం?"



'అంతస్తులు'లో కృష్ణకుమారి,

కళాధరుని కేదో సందేహం అంకురించినట్లుంది "మహారాజా! ఒక చిన్న విషయం అడుగుతాను, సమాధానం చెబుతారా?"

"ఏమిటది?"

"ఇంతవరకు మీ రెందుకు పెళ్ళి చేసుకోలేదు. తెలుసుకోవచ్చా? నచ్చిన కన్య దొరకలేదా?" అడిగాడు

నిట్టూర్పు విడిచి "నాకు పెళ్ళిమీద అనక్తి పోయింది కళాధరా! ఈ జీవితం ఇలా గడిచిపోతే అంతే చాలు!" సమాధానించాడు అనంగపాలుడు

"మీ విరక్తి చూస్తుంటే ప్రేమలో దెబ్బ తిన్నట్టున్నారు!"

"ప్రేమలోనేకాదు జీవితంలో దెబ్బతిన్నట్టున్నారు!"

"ప్రేమలోనేకాదు జీవితంలోనే దెబ్బ తిన్నాను. నా అన్న వాళ్లందరూ అన్యాయం చేశారు ప్రేమించినవాళ్ళే ద్వేషించారు"

"మీరు పొరపాటు పడుతున్నారు ప్రేమకు ద్వేషం ఎప్పుడూ ఉండదు ఇంతకూ మీ ప్రేయసి ఎవరో తెలుసుకోవచ్చా?" కుతూహలం కనబరిచాడు కళాధరుడు

"మా మేనమామ కుమార్తె కళావతి!"

"ఇప్పుడామె ఎక్కడుంది?"

"తెలియదు" నిరాశతో చెప్పాడు అనంగుడు

"తెలిస్తే మీ రామెను ఆదరిస్తారా?"

"కళావతి ఎక్కడుందో తెలుసా, తెలిస్తే చెప్పు కళాధర్?, చెప్పు!" ఆత్రుతగా అడిగాడు.

ఎవరికోసమయితే అనంగుడు ఆలోచిస్తూ, ఆత్రం వ్యక్తపర్చుకున్నాడో ఆ కళావతి అక్కడికి వచ్చింది! మామూలుగాకాదు. మారువేషంలో అభిమానం చూపవలసిందిపోయి ఆమె వేషం చూసి ఆవేశం తెచ్చుకున్నాడు. అనంగుడు "కళావతీ, ఏమిటీ వేషం? ఇక్కడ కెందుకొచ్చావ్?" అడిగాడు.

"మీ కోసమే!"

"కాదు ఇందులో ఏదో మోసం ఉంది అజ్ఞాతంగా నువ్వు, మీ నాన్న ఎన్నో అత్యాచారాలు చేస్తున్నారు దేశాన్ని దోచుకుంటున్నారు."

"బావా! మా కెవరికీ మీ రాజ్యంమీదగాని, సంపదమీదగాని ఆశలేదు ఎక్కడున్నా ఏం చేసినా మీ సౌఖ్యం కోసమే కాని ఈనాటికీ నువ్వు నిజాన్ని తెలుసుకోకపోవడం మా దురదృష్టం." అన్నది కళావతి విషణ్ణ వదనంతో

"అయిందా నీ ఉపన్యాసం ఇక నువ్వువెళ్ళొచ్చు!"

"వెళ్లను ఇంకెక్కడికీ వెళ్లను నిన్నెక్కడికీ వెళ్ళనివ్వను నా కంఠంలో ప్రాణం ఉండగా ఇక్కట్నించి నిన్ను కదలనివ్వను" అన్నది కళావతి ఒక నిశ్చయానికి వచ్చి

"కళావతీ! అడ్డులే! మా ఆనందానికి అంతరాయం కలిగించకు" హెచ్చరించాడు అనంగుడు.

"ఏమిటా ఆనందం" ఆమె కంఠంలో వ్యంగ్యం ధ్వనించింది

"ఏమిటా? మధురమైన, వసంతమైన పాట, ఒళ్లు జలదరించే ఆట, ఒకటేమిటి అక్కడ స్వర్గమే ఉంది"—

బరువుగా నవ్వి "అదే నీకు ముఖ్యమయితే ఆ సర్వం కూడా ఉంది బావా!" అన్నది

"అంటే నువ్వు గజ్జెకట్టి ఆడగలవా! పాడగలవా? మాతోబాటు మధువు సేవించగలవా"

"నీ కోసం ఏమైనా చేస్తాను. నిన్ను రక్షించుకోవడానికి ప్రాణాలైనా ఇస్తాను"

ఇంతలో "హు, ఆదర్శ ప్రేమికులను ఒంధించండి!" అన్నాడు కటువుగా సైనికులతో వచ్చిన వరసింగరాయలు

—ఈ సన్నివేశం గౌరీ ప్రొడక్షన్స్‌వారి "ఆకాశరామన్న" చిత్రంలోనిది పీటూరి రచన చేసి. ఈ చిత్రానికి దర్శకుడు : జి విశ్వనాథం, సంగీతం కోదండపాణి. నిర్వహణ యస్ భావనారాయణ

—మోహన్ కుమార్ ★

# వార్తలు - విశేషాలు

## పద్మశ్రీ నాగయ్యకు సన్మానాలు!

దక్షిణభారత చలనచిత్ర రంగంలో 'పద్మశ్రీ' బిరుదునుపొందిన తొలి నటుడు, సినీ రంగానికి మూలపురుషుడూ అయిన శ్రీ చిత్తూరు నాగయ్యకు హైదరాబాదు, విజయవాడ, కావలి, మద్రాసు తదితర ప్రాంతాలలో ఘనంగా సన్మానాలు, సత్కారాలు జరిగాయి.

మద్రాసులో జరిగిన వివిధ సభల్లో తెలుగు వారితోబాటు, తమిళులు, తదితరులు పాల్గొని శ్రీ నాగయ్య సినీరంగంలో చేసిన కృషిని, సాధించిన ప్రగతిని కొనియాడారు.

మొన్న శుక్రవారం సాయంత్రం—మద్రాసు



వి. నాగయ్య.

లోని ఉడ్‌లాండ్స్ హోటల్లో సుప్రసిద్ధ స్టిల్ ఫొటోగ్రాఫరు శ్రీ జైహింద్ సత్యం ఏర్పాటుచేసిన సభకు మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి చంద్రారెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ ముదిగొండ లింగమూర్తి స్వాగతవాక్యాలు పలికారు.

శ్రీ చంద్రారెడ్డి తమ ఉపన్యాసంలో శ్రీ నాగయ్య చిత్ర పరిశ్రమకై చేసిన అవిరళ కృషిని కొనియాడారు. వివిధ రంగాలలో, వివిధ రూపాల్లో శ్రీ నాగయ్య తన బహుముఖ ప్రజ్ఞను వ్యక్తపరచి, తద్వారా చలనచిత్ర పరిశ్రమకే మూలపురుషు డయ్యారని ఆయన అన్నారు. శ్రీ నాగయ్యకు తొలిసారిగా యీ రంగంలో అవకాశం యిచ్చిన శ్రీ బి. ఎన్. రెడ్డిని కూడా ప్రధాన న్యాయమూర్తి అభినందించారు. ప్రభుత్వం అందజేసిన యీ 'పద్మశ్రీ' బిరుదు, శ్రీ నాగయ్య భవిష్యత్తులో ఇంకా ఘనంగా పొందవలసిన సత్కారాలకు నాంది కాగలదని ఆయన ఆశించారు.

నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు తమ సహజ గాంభీర్య ధోరణిలో సన్మానపత్రాన్ని చదివారు.

నటుడు శ్రీ శివాజీగణేశన్ ప్రసంగిస్తూ శ్రీ నాగయ్య ద్రోణాచార్యు లయితే, తామంతా ఏకలవ్యులమనీ, నాగయ్యకు అన్ని రంగాలలో విశేషమైన ప్రజ్ఞ కలదనీ, కాని సంపాదించటం,దాచుకోవటం ఆయనకు తెలియదనీ అన్నారు.

శ్రీ దాశరధి, జైహింద్ సత్యంగారిని గురించి ప్రసంగించారు.

నాగయ్య తమ సమాధానంలో,—యీ 'పద్మశ్రీ' బిరుదు దక్షిణాది చిత్రరంగానిదనీ, కాని తను అందరికంటె పెద్దవాడు గనుక, అందరి తరఫున తాను పుచ్చుకుంటున్నాననీ అన్నారు దర్శకులు శ్రీ పి. పుల్లయ్య వందనసమర్పణ చేశారు.

తరువాత వినోద కార్యక్రమాలు జరిగాయి. శ్రీ కె రఘురామయ్య ఈల పాట అందరినీ ఆకర్షించింది.

సన్మానమంతా ఒక ఎత్తు, శ్రీ వేణు మాధవ్ కార్యక్రమం మరొక ఎత్తు ఇదే సందర్భంలో శ్రీ వేణు మాధవ్ ప్రదర్శించిన ఏకపాత్రాభినయం, మిమిక్రి, అనుకరణలు సభికుల మన్ననలను విశేషంగా అందుకొన్నాయి.

### విజయవాడలో

శ్రీ నాగయ్యను గత వారంలో విజయవాడ కూడా ఘనంగా సన్మానించింది ఒకేరోజున ఆయన ఎన్నో సన్మానసభల్లో ప్రసంగించారు విజయవాడలో సన్మానించినవారిలో స్థానిక పురపాలక సంఘంవారు, న్యాయవాదుల సంఘంవారూ, భారత వైద్య సంఘం, మారుతీ సినిమాహాలు అధిపతులు, గాంధీ మునిసిపల్ హైస్కూలువారు ఉన్నారు. ఒక సభలో శ్రీ నాగయ్యను 'అశోక స్వాపం' కూడా బహూకరించడం జరిగింది ఈ సభల్లో పలువురు ప్రముఖులు ప్రసంగిస్తూ, శ్రీ నాగయ్య ప్రతిభా విశేషాలను ముచ్చటించారు.

### పుణ్యక్షేత్రాల మీద చలనచిత్రం

ఆంధ్రదేశంలోని పుణ్యక్షేత్రాల ప్రాశస్త్యాన్ని విశదపరచేందుకు లలితశ్రీ పిక్చర్సువారు 'తీర్థయాత్ర' లేక 'ఆంధ్ర పుణ్యక్షేత్రములు' అనే చలనచిత్రాన్ని రూపొందిస్తున్నట్లు ఒక పత్రికలో వ్రాస్తున్నారు.

ఆమధ్య, మంగళగిరి శ్రీ పానకాల లక్ష్మీనరసింహ స్వామి ఆలయంలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఈ చిత్రం షూటింగు కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరిపారు. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డి 'క్లాపర్' గా వ్యవహరించారు.

ఈ చిత్రానికి సంగీతం : మంగళంపల్లి బాల మురళీకృష్ణ, రచన . గొల్లపూడి మారుతీరావు, నృత్య దర్శకత్వం . శ్రీ వి. జె. శర్మ, నిర్మాత, దర్శకులు : శ్రీ రమణమూర్తి.

### విజయశంఖం

సుజాత చిత్ర వారి ప్రథమ జానపద చిత్రానికి "విజయశంఖం" అని పేరు పెట్టారు. 5 రీళ్ల వరకు తయారైన ఈ చిత్రం మళ్లీ ఏప్రిల్‌లో సెట్స్‌కు వెళ్తోంది. ఈ చిత్రానికి రచయిత, నిర్మాత · శ్రీ కనకమేడల దర్శకుడు · శ్రీ హనుమాన్ కృష్ణమూర్తి, సంగీతం శ్రీ బి గోపాలం, కెమెరా



ఇటీవలనే మద్రాసులో విచిత్ర వేషధారణ ఏకపాత్రాభినయం ప్రదర్శించిన శ్రీ ఆర్. కె. రావు.

శ్రీ వేణు, కళ : శ్రీ సోమనాథ్, కూర్పు : శ్రీ హనుమంతరావు, ఈ జానపద చిత్రములో రేలంగి, రాజనాల, బాలయ్య, మిక్కిలినేని రాజసులోచన, హేమలత ప్రధాన పాత్రలు ధరిస్తున్నారు.

ఈ చిత్రాన్ని సెప్టెంబర్లో విడుదల చెయ్యటానికి నిర్మాత సన్నాహాలు చేస్తున్నారు.

## విశాఖలో 'శ్రీ ధారా'

## నాట్యావధానం

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు యొక్క తెలుగు
ి సమితి ఆమంత్రణోత్సవం వాల్తేరులో జరి
సందర్భాన్ని పురస్కరించుకొని, ఒంగోలు కళా
తెలుగు శాఖ ఉపన్యాసకులు శ్రీ ధారా రామనాథ
స్త్రి నాట్యావధానం ప్రదర్శనం చేశారు. రక
ల హావ భావాలను ప్రదర్శిస్తూ, వేర్వేరు
తలను వివిధ సన్నివేశాలను శ్రీ రామనాథశాస్త్రి,
స్పకులు కోరిన రీతిన ప్రదర్శించి, సభికుల
ప్రసలను పొందారు. తదనంతరం—రెండే పాత్ర
న్న ఏకాంకికను ప్రముఖ మహారాష్ట్ర నటుడు
పి ఎల్. దేశపాండే మార్గాన, నాట్యావధాని
రామనాథశాస్త్రి హాస్యరసభరితంగా, సందర్భో
చిమైన నటనలో ప్రదర్శించారు.

శ్రీ శాస్త్రి లోగడ కూడా ఇలాంటివి పలు
దర్శనలును తెలుగుదేశమంతటా ఇచ్చారు.

## పంజరంలో పక్షులు

### ఢిల్లీ లో తెలుగు నాటక ప్రదర్శనం

దక్షిణభారత నటీనట సమాఖ్య సభ్యులు విన్న
యంకాలం సప్రూ హౌస్‌లో "పంజరంలో
క్షులు" నాటకాన్ని ప్రదర్శించారు. శ్రీ పిని
శెట్టి శ్రీరామమూర్తి వ్రాసిన ఈ నాటకమునకు
శ్రీ న్యాయపతి రాఘవేంద్రరావు దర్శకత్వం వహిం
రు

56 వ పేజీ చూడండి



'తుపాకీపిల్ల'లో మనోరమ.



కావలిలో 18–3–1965 న 'మిత్రమండలి' వారు శ్రీ నాగేశ్వరరావుగారిని సన్మానించారు. సన్మానసభకు అధ్యక్షులు శ్రీ నాగయ్యగారు. ఈ చిత్రం ఆ సందర్భంలో తీసినది.



"దేవత"లో సరస్వతి.

**చిత్రసమీక్ష**

# తేనెమనసులు

ఏదైనాసరే ఒక కొత్తమార్గమంటూ చేపట్టి అసాధారణమయిన చిత్రాన్ని తయారు చేయాలనీ, ప్రేక్షకులు సహజంగా వూహించేదానికి భిన్నంగా తమ చిత్రాన్ని రూపొందించాలని యీనాటి నిర్మాతలు (ఇతర భాషల్లో) కృషి చేయటం జరుగుతోంది. ఈ కృషి ఫలితంగా ఇటీవలనే కొన్ని చిత్రాలు వచ్చాయి.

అలాంటి కృషి తెలుగులో మనకు కనిపించదు. కాని, ఇటీవలనే శ్రీ ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వాన వెలుగుజూచిన 'తేనేమనసులు' చిత్రం తెలుగు చిత్ర రంగంలో ఒక వినూత్న ప్రయోగం.

ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలకుతోడు మరో పది కొత్త ముఖాలు వెండితెరకు, ప్రేక్షకులకు అమాంతంగా పరిచయం చేయటానికి తగినంత ఆత్మవిశ్వాసానికితోడు, ప్రతిభ కావాలి.

'తేనెమనసులు' చిత్రంతో తెలుగు చిత్ర పరిశ్రమలో కొత్త వాతావరణం ప్రవేశించింది. చాలామంది నిర్మాతలు, దర్శకులు కూడా ముమ్మందు కొత్తతారలకోసం వేటకు బయలుదేరినా ఆశ్చర్యం లేదు.

ఇలాంటి వాతావరణాన్ని ప్రవేశపెట్టటానికి కారకులు, బాధ్యులు, దర్శకులు శ్రీ ఆదుర్తి సుబ్బారావు. శ్రీ సుబ్బారావు తీసే చిత్రాలు అసాధారణమైనవి. ఏరెండు చిత్రాలు ఒకలాగా వుండవు. ప్రజాదరణతో నిమిత్తంలేకుండా, ప్రతి చిత్రమూ కొత్తరకంగా వుంటుంది. 'తేనెమనసులు' అంతే.

ప్రధాన కథకులు శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ...

ఇద్దరు అందమైన అబ్బాయిలు. మొదటివాడు చిట్టిబాబు పుస్తకాలపురుగు. ఎప్పుడూ పుస్తకం చేతిలో వుండాల్సిందే. రెండవవాడు బసవరాజు. ఆటల్లో ఆరితేరినదిట్ట. కాలేజీ పుట్బాల్లో ఛాంపియన్‌గా నెగ్గిన ఘనుడు.

చిట్టిబాబు చిన్నతనం నుంచే అన్నావదినల అండన పెరుగుతాడు. వాళ్ళే అతన్ని చదివిస్తారు. చదువు ముగుస్తున్నదశలో పెళ్లి సంబంధం కూడా ఖాయపరుస్తారు. ఇంతలో అమెరికాలో సీటువచ్చిన అతనికి 'పెళ్లిగిరాకీ' హెచ్చటం జరుగుతుంది. మునుపు ఖాయపడ్డ సంబంధంవారినే పదివేలు ఇవ్వవలసిందని చిట్టిబాబు అన్న, వదినలు అడుగుతారు. కాని, వియ్యాలవారిది పేద సంసారం. పెళ్లి కూతురు సీతకూడా చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకొని, తండ్రి చేతిలోనే చెల్లెలితోపాటు పెరిగింది. ఆమె తండ్రి కూడా మునలివాడు. పదివేలు ఎలా యిస్తాడు? గత్యంతరంలేక దొంగతనానికి పాల్పడి, పదివేల్తో, కూతురు సీతను ఇచ్చి పెళ్లి జరిపిస్తాడు.

కాని యీ దొంగతనంవల్ల మరోచోట జరగవలసిన పీటలమీదపెళ్లి ఆగిపోతుంది. చిట్టిబాబు స్నేహితుడయిన బసవరాజుకు కూడా అదే ముహూర్తానికి అక్కడే సంబంధం కుదురుతుంది. పెళ్లికూతురు తరఫువారు బాగావున్నవారు. అమ్మాయి పేరు భానుమతి, బి ఏ. చదివిందికూడా. ఆఫీసు డబ్బుతోబాటు, కట్నండబ్బు తెద్దామని బ్యాంకుకు వెళ్లిన భానుమతి తండ్రి డబ్బు పోగొట్టుకొంటాడు ఆ డబ్బును దొంగిలించింది ఎవరోకాదు, సీత తండ్రే!

తన నిజాయితీ యీలోకం నమ్మదన్న భావంతో భానుమతి తండ్రి పరారీ అయిపోతాడు. పీటలమీద పెళ్లి ఆగిపోతుంది. పెళ్లికొడుకు, పెళ్లికూతురి ముఖమయినా చూడకుండా వెళ్లిపోతాడు.

తండ్రి ఆచూకీ కూడా తెలియక పోవటంతో భానుమతి విచారిస్తుంది. ఆమె తన తండ్రిని దొంగగానే భావిస్తుంది. పైగా ఆయన పరారీ అయిపోవటంతో, యీ అనుమానం నిజమవుతుంది. ఊళ్లోవాళ్లు నలుగురూ ఎత్తిపొడవటంతో తల్లీ కూతుళ్లు బసమారుస్తారు. ఈలోగా భానుమతి టైపు ప్రాక్టీసు చేస్తుంటుంది.

పెళ్లి చేసికొన్న చిట్టిబాబు అమెరికా వెళ్తాడు. బసవరాజుకు డ్రిల్లు మాష్టరు వుద్యోగం వస్తుంది.

డ్రిల్‌మేష్టరి స్కూలు, భానుమతి టైపు ఇన్‌స్టిట్యూట్ దగ్గర కావటం మూలంగా, క్రమేణా వారి హృదయాలు కూడా దగ్గరవుతాయి. కట్నం ఇవ్వని కారణంగా ఒకప్పుడు తాను నిర్లక్ష్యం చేసిన అమ్మాయే యీ భానుమతి అని రాజుకు తెలీదు.

అమెరికానుంచి తిరిగివచ్చిన చిట్టిబాబుకు ఇండియా రాకముందే ఇక్కడే ఒక పెద్ద కంపెనీలో మేనేజరు ఉద్యోగం వస్తుంది అతని వేషభాషలుకూడా మారటం, ప్రవర్తన మారటంతో భార్య సీతను, అన్నవదినలను, మామను అవమానిస్తాడు, నిందిస్తాడు. భానుమతికి ఇంతలో అదే ఆఫీసులో సెక్రటరీ వుద్యోగం, క్రమేణా బసవరాజుకు మరో ఉద్యోగం వస్తాయి. చిట్టిబాబు, ఆమెనుచూచి 'మోహం' లో పడిపోతాడు. అందుకు ఆమె అంగీకరించదు.

కాని, సీతకాపురాన్ని సరిదిద్దాలని ఆమె ఎన్నో పన్నాగాలు పన్నుతోంది సీతనే తన స్థానంలో వుంచిన సంఘటనలూ వున్నాయి.

భానుమతి, చిట్టిబాబుల సాన్నిహిత్యాన్ని అపార్థం చేసికొన్న బసవరాజు ముష్టియుద్ధానికి దిగుతాడు. నాలుగు దెబ్బలుతిన్న చిట్టిబాబు తన తప్పిదాన్ని గ్రహిస్తాడు. చేసిన పాపాల పరిహారార్థం అందరూ కాశీ వెడతారు. ఇవే బాబూమూవీస్ వారి 'తేనేమనసులు'.

ఈ చిత్రంలోని ముఖ్యమైన అంశాలు రెండు! మొదటిది కొత్తవారల నమ్మకతనం, వీరిలో ఎందరు తారలు అవుతారనే అంశం, వారి వారి ప్రతిభా విశేషాలమీదకంటె, ముమ్మందు వచ్చే అవకాశాల మీదనే ఆధారపడి వుంటుంది. నటనకు సంబంధించినంతవరకూ అన్నీ సమగ్రమైన పాత్రలే. ప్రతి ఒక్కరికీ చక్కని తర్ఫీదు ఇచ్చినట్లు కనిపిస్తుంది.

రెండవది· తెలుగులో రంగులతో తయారయిన తొలి సాంఘిక చిత్రం ఇదే.

నటులంతా 'సమర్థత'తో నటించారు. అనటం కంటే, దర్శకుడు శ్రీ ఆదుర్తి యీ కొత్తవారికి నటనా సామర్థ్యాన్ని మారిపోశాడని చెప్పటం సబబుగా వుంటుంది.

'ముళ్లపూడి' మార్కు హాస్యం చిత్రం ప్రతి అడుగులోను కనిపిస్తుంది.

డ్రిల్లుమాష్టరుగా కృష్ణ, అతని జోడీగా సుకన్య, చిట్టిబాబుగా రామ్మోహన్, అతని ప్రక్కన



'తేనెమనసులు'లో రామ్మోహన్, సంధ్యారాణి.

సంధ్యారాణి చక్కని కృషితోపాటు నటనను కూడా వ్యక్తపరచారు. చిన్నపిల్ల రోజారాణి చక్కగా నటించింది. మిగతా పాత్రధారుల్లో పుష్పకుమారి, వాణీబాల, కోటేశ్వరశాస్త్రి, చలపతిరావు, జి. ఎస్. ఆర్. మూర్తి, వెంకటేశ్వరరావు, ఇ. వి. సలం, రాధాకుమారి వారివారి పాత్రలకు బాగా సరిపోయారు. జయశ్రీ నృత్యం బాగున్నది.

ఫొటోగ్రఫీ చాలా ఆధునికంగాను, ఆహ్లాదకరంగాను వుంది. ఇతర సాంకేతికనిపుణులు కూడా ఒక్కోమారు కొత్తతారల మీదనే దృష్టి మరల్చారా అనిపిస్తుంది. పాటలు విన్నంతసేపు బాగా వున్నాయి. 'డ్రిల్‌మాష్టారి' మీద పాడినపాట ఆత్రేయగారు లోగడ వ్రాసిన కొన్ని 'మహాత్ములను' గుర్తుకు తెస్తుంది. ఔట్‌డోర్ దృశ్యాలు కొన్ని చాలా బాగున్నాయి.

'తేనెమనసులు'లో ప్రేమికులందరికీ మనసు మీద కంటె తనువుమీదనే, మమతమీద కంటె మగువమీద ఎక్కువ మక్కువ వున్నట్లు కనిపిస్తుంది.

అమెరికా వెళ్లివచ్చినవాడు అనాగరికుడు కావటం, చిట్టిబాబుకు పరస్త్రీ భానుమతి, తన భార్య అయిన సీతలమధ్య తారతమ్యం తెలియక పోవటం, ఇలాంటివి మరికొన్ని సంఘటనలు వివేకవంతుడయిన ప్రేక్షకుని మెదడుకు పనికల్పిస్తాయి.

పెళ్లిముచ్చట్లు, పెళ్లాంముచ్చట్లు తీరని యువతీయువకులు, అవి ఇంకా తీర్చుకోనగోరే ఇతరులు యీ చిత్రాన్ని చూసి ఆనందిస్తారు.

కాలక్రమాన చిత్రాలలో వస్తున్న నవ్యత్వానికి, మారిపోతున్న విలువలకు 'తేనెమనసులు' ప్రత్యక్షసాక్ష్యం!

## ఆదుర్తి ఉవాచ...

'తేనెమనసులు' చిత్రాన్ని విలేఖరులకు ప్రదర్శించేందుకు కొన్ని నిమిషాలముందు దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు పత్రికాగోష్ఠి జరిపారు. ఈ గోష్ఠిలో ఆయన కొన్ని అపోహలను తొలగించారు.

కొందరు మిత్రులన్నట్లు, కొన్ని పత్రికలు వ్రాసినట్లు ఇది పాతవారిమీద సవాల్ కాదని, కొత్తవారికి అవకాశం కల్పించటమేనని ఆయన అన్నారు. 'విశాలనేత్రాలు'తో బాటు తాము నిర్మించదలచిన 'కన్నెమనసులు' చిత్రంలోకూడా కొన్ని తేనెమనసులు మరికొన్ని సరికొత్త మనసులు వుంటాయన్నారు.

మొత్తంమీద, శ్రీ ఆదుర్తి చేసిన యీ ప్రయోగం తెలుగుదేశంలో అపూర్వమే. ఇలాంటి ప్రయోగాలు చేయగల సాహసం, మొండిధైర్యం ఎంతమందికి వున్నాయో తెలియదుగాని, తొలిసారిగా ముందుకువచ్చి నడుంకట్టిన ఘనతమాత్రం సుబ్బారావుగారికే దక్కుతుంది. అందువల్లనే, ఆయన చేసిన యీ ప్రయోగం విజయవంతం కావాలని ఆశిద్దాం.

* * *

(తాజావార్త: ప్రసిద్ధ దర్శకుడు శ్రీధర్ తమిళంలో నిర్మించిన "వెన్నిర్ ఆడయ్" అనే కొత్త తారల చిత్రానికి సెన్సార్‌బోర్డు 'అడల్ట్స్ ఓన్లీ" (పెద్దలకు మాత్రమే) సర్టిఫికేటిచ్చింది )

—వాశిరాజు ప్రకాశం ★

# వార్తలు-విశేషాలు

53 వ పేజీ తరువాయి

ఇందులో కుమారి రోజారాణి అయిదా, కుమారి సి. ఎస్ మంజువాణి, శ్రీయుతులు ఆర్. విద్యాసాగర్‌రావు, కె. వి. ఎల్. శాస్త్రి, ఎస్. ఎ. ఎల్. నరసింహం, సి. ఆంథోనీ, క్రొవ్విడి లక్ష్మన్న నటించారు.

ఇందులో స్వప్నదృశ్యం, కుమారి శాంత, ఎం. ఎస్. ప్రసాదరావు పాడిన పాటలు, పాత్రధారుల నటన, ప్రేక్షకుల ప్రశంసలనందుకున్నాయి.

* * *

ఢిల్లీ ఆంధ్రులు, ఆంధ్ర అసోసియేషన్ ప్రెసిడెంటు శ్రీ డి. ఎస్. రాజుగారి అధ్యక్షతన సమావేశమై శ్రీ అమ్ముల విశ్వనాథంగార్ని సన్మానించారు. శ్రీ విశ్వనాథంగారు ఆంధ్ర అసోసియేషన్‌వారి ఆహ్వానముపై ఇచటకు విచ్చేసి, అనేక హరికథలు చెప్పి శ్రీయుతులు సంజీవయ్య, కె. ఎల్. రావు, డి. ఎస్. రాజుగార్ల ప్రశంసలనందుకొన్నారు.

* * *

ఇచట ఈనెల 13 వతేదీన ఆంధ్ర అసోసియేషన్ ఆధ్వర్యమున కుమారి సుశీల కూచిపూడి నృత్యప్రదర్శన జరిగింది. ఈ సందర్భమున కేంద్ర మంత్రి శ్రీ సంజీవయ్య నర్తకిని ప్రశంసించి ఆశీర్వదించారు. కుమారి సుశీల శ్రీ సంపత్‌కుమార్ శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మగార్ల శిష్యురాలు.



'అంతస్తులు'లో గుమ్మడి.



'అంక్కల్ టామ్స్ కాబిన్' చిత్రంలో టామ్ పాత్రధారుడు, ఒకప్పుడు అమెరికా సైనికుడు అయిన జాన్ కిట్జ్ మిల్లర్, ఇవా పాత్రధారిణి ఛార్లీ ఫాసెట్‌లు నటించిన ఒక రసవత్తర సన్నివేశం.

## అంకల్ టామ్స్ కాబిన్

అమెరికాలో శ్వైతం బానిసత్వాన్ని నిర్మూలించటానికి విరివిగా తోడ్పడిన హారియట్ బీచర్ స్టో రచన "అంకల్‌టామ్స్ కాబిన్" త్వరలో ప్రపంచంలోని పలుచోట్ల ప్రదర్శింపబడుతుంది. 113 సంవత్సరాలలో ప్రపంచ స్థాయిన విరివిగా పేరు, ప్రఖ్యాతులు, ధనము గడించిన ఈ చిత్రంలో ప్రసిద్ధి పొందిన పలువురు నటించారు.

ఫ్రాంజవెజిల్ రచన "ఎంబెజెల్డ్ హెవెన్" యొక్క పశ్చిమ జర్మనీ చిత్రంలో నటించే విషయం పోప్ పయస్ 12 తో మాట్లాడిన ప్రముఖ వ్యక్తి జార్జ్ రూధర్ ఒక రకంగా ఈ చిత్రాలకు పునాది వేశారు. పదకొండు దేశాలకు చెందిన పదకొండుమంది భాగస్వాములు ఈ చిత్ర నిర్మాణంలో పాల్గొనేందుకు సమ్మతించిన తరువాత అమెరికాలోని జాతి విచక్షణ సమస్య కొంతవరకు ఈ ప్రయత్నాలను ఆటంక పరచింది. 'అంకల్ టామ్స్ కాబిన్" అనే ఈ చిత్రానికి అన్ని రకాల సహకారమూ లభించింది. భాగస్వాములు డబ్బుతో ముందుకు వచ్చారు. ఇటాలియన్, ఫ్రెంచి నిర్మాతలు కొందరు పశ్చిమ జర్మనీ నిర్మాతలకు చేదోడు వాదోడుగా నిలిచారు. వీరందరి సహకారం చిత్ర నిర్మాణానికి దారి తీసింది. మ్యూనిచ్‌లోని నీగ్రో విద్యార్థులను చివరకు బెల్‌గ్రేడ్‌లోని ఇథోపియన్ రాయబారి చిన్న కుమారుణ్ణి కూడా ఇందులో చిత్రీకరించారు. దర్శకుడు : గెజావోన్ రద్‌వాన్‌యీ.

'అంకల్‌టామ్' ప్రధాన పాత్రను ధరిస్తున్న జాన్‌కిట్స్ మిల్లర్ ఒకప్పుడు ఇటలీలోవున్న అమెరికా సైనికుడు. అక్కడే నటన అనుభవాన్ని సంపాదించాడు. హెల్బీ పాత్రను చార్లీ ఫావెట్ ధరిస్తారు. ఇతర పాత్రలన్నింటిలో కూడా ప్రతిభావంతులైన పటీ నటులు నటించారు.

(యు. పి. ఎస్.) ★

Edited. Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Stree,
Madras-1. Phone; 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



అభినయం

—ఫొటో: ప్రభాకర్ యుగంధర్

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



రత్న

అందమైన ముఖ వర్చస్సునకు
ఎక్కువ కాలం నిలిచే పరిమళమునకు

# రెమి

టాల్కమ్ పౌడరు

CRITERION RP 556